Swechcha By Volga

Swechcha Publications No. 6

మొదటి ముద్రణ : పటుర, ఫిబ్రవరి 1987

స్వేచ్ఛ ప్రచురణగా మొదటి ముద్రణ : మే 1994

ప్రతులు : 1500

వెల : 20 రూ.

ప్రతులకు :

ప్రగతి బుక్ హౌస్
సూర్యోదయం రోడ్డు
విజయవాడ-2

మైత్రి బుక్ హౌస్
మసీదు వీధి, ఏలూరు రోడ్డు
విజయవాడ-2

నవోదయ బుక్ హౌస్
ఆర్యసమాజ్ ఎదురుసందు
హైదరాబాద్

విశాలాంధ్ర బుక్ హౌస్
అన్ని బ్రాంచిల్లో

---

ముద్రణ :
నాగేంద్ర ప్రెస్, విజయవాడ-2

ముఖచిత్రం :
విప్ల ప్రింటర్స్, హైదరాబాద్

# అంకితం

ఆంధ్రదేశంలో ఏ ఆడపిల్లా పెరగనంత
స్వేచ్ఛగా పెరగనిచ్చి ఆ స్వేచ్ఛ వల్ల
ఎన్ని ఇబ్బందులొచ్చినా భరించి
నన్ను ప్రేమించిన
అమ్మా నాన్నా
కోపూరి వెంకటసుబ్బమ్మ
కోపూరి వెంకటసుబ్బారావులకు
ప్రేమతో అంకితం ఈ స్వేచ్ఛ

## కృతజ్ఞతలు

చతురలో అత్యుత్తమ నవలగా ఎంచుకుని
ప్రచురించిన చలసాని ప్రసాదరావుగారికి -
ముఖచిత్రం ఫోటో యిచ్చిన మిత్రులు
ఫణికుమార్ గారికి -
కవర్ పేజీ డిజైన్ చేసిచ్చిన స్నేహితుడు
అంజన్ బాబుగారికి.

# నా మాట

"Freedom is the recognition of necessity" - Engles

"మన జీవితాల్లోనయినా, వాటిచుట్టూ వుండే సమాజంలోనయినా - వాటి చలన సూత్రాలను అన్వేషించడమే అవశ్యకత. ఆ అవశ్యకతను గుర్తించటమే స్వేచ్ఛ. ఆ అన్వేషణ దశలో - స్వేచ్ఛ నవలలోని హీరోయిన్ జీవితంలోలా - సంక్షోభమూ వుంది, సంఘర్షణా వుంది. అవశ్యకతను గుర్తించిన తర్వాత - స్వేచ్ఛానంతర జీవితంలో సంఘర్షణే గాని సంక్షోభం వుండే అవకాశం లేదు"

—సి. వి. సుబ్బారావు

'స్వేచ్ఛ' ను నవలగా ప్రచురిస్తే దానికి ముందుమాట రాయాలని ఎంతో కుతూహలపడిన ప్రియ మిత్రుడు సుబ్బారావు లేకుండా స్వేచ్ఛ నవల ప్రచురిత మవటం నా జీవితంలో పెద్ద విషాదం. సుబ్బారావు ఉత్తరాల్లో రాసిన నాలుగు వాక్యాలూ తిరిగి రాసుకోవటం తప్ప మరేం చెయ్యగలను ? నాకూ, సుబ్బారావుకీ మాట్లాడుకోడానికి చాలా యిష్టంగా వుండే విషయం స్వేచ్ఛానంతర జీవితం. బహుశ యిద్దరం ఆ జీవితపు ఆటుపోట్లలో పడి కొట్టుకున్నవాళ్ళం కాబట్టేమో ! 'స్వేచ్ఛ' నవల వచ్చాక మేమిద్దరం ఎప్పుడు కలిసినా స్వేచ్ఛానంతర జీవితం గురించి చర్చించకుండా వుండేవాళ్ళం కాదు. తను రాసే ముందుమాటలో ఆ చర్చల సారాంశమంతా వుంటుందని వూరించి వూరించి మాటమాత్రం చెప్పకుండా మాయమై పోయాడు ! ఇప్పుడు 'స్వేచ్ఛ' నవల గురించి నాలుగు మాటలు రాద్దామంటే ఏమీ చేతకానిదానిలా అయిపోతున్నాను. నా శక్తంతా కూడగట్టుకుని సుబ్బారావు మరణం నుంచి స్వేచ్ఛ పొందే ప్రయత్నం చెయ్యాలని గట్టిగా అనుకుని నాకు తోచినదేదో రాస్తున్నాను.

'స్వేచ్ఛ' మొదట చతురలో ప్రచురించబడి ఏడేళ్ళు నిండాయి. (1987 ఫిబ్రవరి). ఈ ఏడేళ్ళ కాలంలో యింత వివాదాస్పదమయిన నవల, యింతగా చర్చింపబడిన నవల మరొకటి రాలేదు. ఈ నవల వచ్చిన సంవత్సరమంతా ఆంధ్ర దేశంలోని అన్ని పట్టణాల్లోనూ సాహిత్యాభిమానులూ, పాఠకులూ, వామపక్ష పార్టీల వాళ్ళూ ఈ నవల గురించి విస్తృతంగా చర్చించారు. ఆ చర్చలు క్రమంగా సాహిత్యప్రదేశాన్ని వదిలి నా వ్యక్తిగత జీవితంలోకి చొచ్చుకు వచ్చాయి. నా జీవి

తంలో - బాధాకరమే అయినా - అపురూపమైన విలువైన అనుభవాలను యిచ్చాయి. స్నేహం, ప్రేమ, ద్వేషం, సాహిత్యం, జీవితం, రాజకీయాలు, స్త్రీల సంఘాలు, స్త్రీల పరస్పర సహకారం, వీటన్నిటి గురించీ ఎన్నో విలువైన పాఠాలను నేర్చుకున్నాను. ఒక వ్యక్తిగా మరింత బలమైన, స్థిరమైన అభిప్రాయాలతో నిలబడగలిగాను. అట్లా నిలబడగల శక్తి నకుందని తెలుసుకునే అవకాశం నాకిచ్చింది 'స్వేచ్ఛ' నవల.

ఆ విషయాలు పక్కన పెడితే స్వేచ్ఛ నవల ఎందుకంత వివాదాస్పదమయింది అని ఆలోచిస్తే ఆనాటి చారిత్రిక సందర్భం అలాంటిదని అర్థమవుతుంది. స్త్రీవాద భావాలు కొత్తగా ప్రచారమవుతున్న రోజులు. సిద్ధాంత విషయాలుగా చర్చల్లో నలుగుతున్న అంశాలను, కుటుంబ విషయాలుగా, మనందరి జీవితాలకూ సంబంధించిన విషయాలుగా చెబుతూ- ఒక సామాన్య మధ్యతరగతి కుటుంబ స్త్రీ సమస్యగా చర్చించటంతో ప్రతివాళ్ళూ తమ జీవితాల్లోకి ఒకసారి తొంగి చూసుకున్నారు. ఇంతవరకూ వాళ్ళు పక్కన పెడుతున్న ప్రశ్నలను, avoid చేస్తున్న ప్రశ్నలను యిక తప్పించుకోటానికి వీల్లేని విధంగా వాళ్ళ అమ్మాయిలాంటి, చెల్లెలులాంటి, భార్యలాంటి ఒక స్త్రీ అడిగేసరికి చాలామందికి చాలా యిబ్బంది కలిగింది. ఈ ప్రశ్నలు అడగలేకపోతున్న స్త్రీలకు ఈ నవల అడిగే బలాన్నిస్తుందేమోననే భయం కలిగింది. చదువుకుని ఉద్యోగాలు చేస్తున్నప్పటికీ ఇంటా బయటా ప్రత్యక్ష పరోక్ష అణచివేతలో ఉక్కిరి బిక్కిరవుతున్న ఆధునిక స్త్రీ జీవితాన్నీ, ఆమె ఉనికికి అర్థాన్నీ ప్రశ్నించే ఈ నవల సంచలనాన్ని కలిగించింది.

'స్వేచ్ఛ' అనే పేరే నచ్చలేదు కొందరికి. స్వేచ్ఛ, అంతులేని స్వేచ్ఛగా బాధ్యతారహితమైన స్వేచ్ఛగా కనిపించింది. ఏ ప్రయోజనాన్ని ఆశించి స్వేచ్ఛను ప్రతిపాదించాననే ప్రశ్నకూడా వచ్చింది. కానీ స్వేచ్ఛకు అర్థం యేమిటని చాలామంది ఆలోచించినట్లు కనపడదు. Liberty, Equality, Fraternity అని ఫ్రెంచి విప్లవ నినాదం. ఈ మూడిటికీ ఒక వరస వుంది. మూడూ వేరు వేరు విషయాలు. స్వేచ్ఛ, సమానత్వం అని వేరు వేరుగా పిల్చినా చాలామంది ఆ రెంటికీ తేడా లేదన్నట్లు ఆలోచిస్తారు. సమానత్వం సాధిస్తే స్వేచ్ఛ దొరుకుతుందనుకునే వారూ వుంటారు. సమానత్వం లేకుండా స్వేచ్ఛ వుంటుంది గానీ స్వేచ్ఛ లేకుండా సమానత్వానికి అర్థం వుండదు. అది నిలబడదు కూడా. సమాజంలో అసమానత

లను పోగొట్టి సమానత్వం సాధించాలన్నా, సమాన హక్కులూ అవకాశాలూ వున్న మనుషులు పరస్పరం సహకరించుకుంటూ బతకాలన్నా ముందు మనిషి సాధించాల్సింది స్వేచ్ఛ. ఈ స్వేచ్ఛ ఎవరో ఒకరిచ్చేది కాదు. ఎవరి దగ్గరనుంచో సాధించుకునేది కాదు. మన అవసరాలను, మన ఉనికికి అత్యవసరమైన విషయాలను మనం గుర్తించటమే స్వేచ్ఛ. నిజానికి దీని సాధించటమే చాలా కష్టం. మన నుంచి మనకు స్వేచ్ఛ. మనకు పుట్టుక నుంచి అలవాటైన భావాల నుంచీ, అభిప్రాయాల నుంచీ, ఆచారాల నుంచీ స్వేచ్ఛ. మనలో జీర్ణించుకుపోయిన నమ్మకాల నుంచి విడుదల. సామాజిక మార్పులు అనివార్యమైనపుడు ప్రజల్లో ఈ స్వేచ్ఛాకాంక్ష పుట్టుకువస్తుంది. సమాజాన్ని గురించీ, సమాజంలో తన ఉనికి గురించీ, తనకూ సమాజానికీ వున్న సంబంధం గురించీ, ఆ సంబంధాలలో వున్న అణచివేత గురించీ ప్రశ్నించుకుని జవాబులకు వెతికే ప్రయత్నం చేసేవారు స్వేచ్ఛాపథగాములు. వాళ్ళ జీవితాలలో సంఘర్షణలుంటాయి గానీ సంక్షోభాలుండవు. సంక్షోభ దశనుండి దాటే క్రమాన్ని అరుణ జీవితం ఆధారంగా నేను నవలలో చిత్రించాను. అరుణ నవల చివరకు సంక్షోభ దశ దాటి సంఘర్షణలో ఆనందాన్ని పొందగలిగే దశకు వచ్చింది. ఈ స్వేచ్ఛ అనే భావాన్ని అర్థం చేసుకోకుండా, జీవితంలో దానిని పొందకుండా, అనుభవించకుండా మనం చేసే పోరాటాలకు అర్థం వుండదు. ఏ అసమానతలను రూపుమాపాలని పోరాటం చేస్తామో వాటిని యింకో రూపంలో తెచ్చిపెట్టే పోరాటమే అవుతుంది స్వేచ్ఛ లేకపోతే. ప్రతి మనిషీ తన స్వేచ్ఛను— తాను ఎవరికీ, ఏ పెత్తనానికీ లొంగివుండని స్వేచ్ఛను సాధించుకోవాలి. ఆ స్వేచ్ఛను సాధించుకునే క్రమంలో మనిషికి తన స్వేచ్ఛ యితరులకు అపకారం చేయకూడదనే విషయం అర్థమవుతుంది. స్వేచ్ఛలో వున్న బాధ్యత స్వేచ్ఛా రాహిత్యంలో వుండదు. స్వేచ్ఛానంతర జీవితంలో మనిషి తనకు తానూ, సమాజానికీ బాధ్యుడవుతాడు. అందువల్ల స్వేచ్ఛను సరిగా అర్థం చేసుకున్న వారికి బాధ్యతా రహితమైన స్వేచ్ఛ అంటూ వుండదనీ, బాధ్యతా రాహిత్యమంటే దేనికో దానికి బానిసత్వం చేయటమేననీ తెలుస్తుంది. ఆడవాళ్ళు స్వేచ్ఛ లేకుండా, సమాజం తమకు నిర్దేశించిన పనులను ప్రశ్నించకుండా, ఆ పనులు తమనేం చేస్తున్నాయో, తమ ఉనికినెలా అర్థరహితం చేస్తున్నాయో తెలుసుకోకుండా వుండడమంటే చాలా బాధ్యతా రహితంగా వుండటం. పుట్టింది పెళ్ళి చేసుకోటానికన్నట్టూ, పెళ్ళి చేసుకునేది భర్తకు సేవలు చేసి వండి పెట్టి పిల్లల్ని కని పెంచటానికన్నట్టూ బతికే స్త్రీలు, అంతకంటే తమ జీవితాలకు

మరో పరమార్థం లేదని. కుటుంబాల్లో శాంతిని కాపాడటమే తమకు శాంతి అను కునే బతికే స్త్రీలు చాలా బాధ్యతా రహితంగా బతుకుతున్నారు. వారికి తమ పట్లా, సమాజం పట్లా విముఖత్వం తప్ప ఆసక్తి లేదు. సమాజం మారాలని కోరే పురుషులు కూడా ఆ మార్పేదో తాము తీసుకువస్తామనీ, స్త్రీలు అవసరమైనప్పుడు తమకు సహకరించి కుటుంబంలో వాళ్ళ పాత్ర వాళ్ళు పోషిస్తే చాలనీ చాలా బలంగా నమ్ముతారు. అసలు మార్చాల్సింది తమ జీవితాలననీ, తమ జీవితాల గురించి పురుషుల అభిప్రాయాలననీ స్త్రీలు గ్రహించటమంటే ఈ పురుషాధిపత్య సమాజానికి చాలా పెద్ద ప్రమాదం.

తమ పట్ల తమకొక బాధ్యత, సమాజం పట్ల ఒక బాధ్యత వుందన్న భావన లోపలనుంచీ రాకుండా స్వేచ్ఛను ఎవరూ కాంక్షించరు. ఈ బాధ్యతల విష యంలోనే చాలామందికి పేచీ వస్తుంది. ఇంతకు ముందు చెప్పుకున్నట్లు స్త్రీకి పెళ్ళాడి భర్తతో సంసారం చేసి పిల్లల్ని కని పెంచడమేకదా బాధ్యత అని ప్రశ్నిస్తారు. ఆ బాధ్యతలను ఆమె యిష్టంతో స్వీకరించిందా, తను ఎంచుకున్నదా లేక తరతరాలుగా పితృస్వామ్య సమాజం స్త్రీ మీద ఈ బాధ్యతలను మోపిందా అనే ప్రశ్న మొదటి ప్రశ్నకు సమాధానంగా వస్తుంది. ఈ ప్రశ్నకు సమాధానం వెతుకుతూ పోతే పితృస్వామ్య సమాజపు మూలాలన్నీ కదిలి మన ఎదిలోకి వస్తాయి. స్త్రీల అణచివేత క్రమమంతా, ఆ చరిత్రంతా మనం అర్థం చేసుకోవాల్సి వస్తుంది. పునరుత్పత్తి రాజకీయాల ప్రాంగణంలోకి మనం ప్రవేశిస్తాం. కుటుంబంలో కంట్రోలు, అధికారం, లైంగిక సంబంధాల చర్చావేదిక మన కోసం సిద్ధమవు తుంది. ఈ లైంగికత్వం, పునరుత్పత్తి కార్యక్రమం స్త్రీల జీవితాలను శాసించి వారి జీవితాలకు ఒక సాంస్కృతిక రూపాన్ని యిస్తుంది అన్న విషయం మనకు ఈ చర్చల్లో అర్థమవుతుంది. ఆ విషయం తెలిశాక భార్యాత్వం, మాతృత్వం, వేశ్యాత్వం అన్నీ మనమీద మోపబడిన విలువలనీ, ముళ్ళకిరీటాలనీ నిజంగా మనం ఎంచుకున్న బాధ్యతలు కాదనీ అర్థమవుతుంది. నిజంగా ఎంచుకునే స్వేచ్ఛ ఎలా ఎప్పుడు సాధించుకోగలమని తహతహలాడతాం. ఈ బాధ్యతలు బలవంతంగా విధించిన వనే విషయం చాలామంది స్త్రీలకు వారి జీవితానుభవాల ద్వారా-పూపిరాడని అణచి వేత, ఉనికిని హరించే హింస—వీటిద్వారా అర్థమవుతాయి. వాళ్ళ జీవితంలో సంక్షోభానికి గురవుతారు. ఆ సంక్షోభంలోంచి తమ అణచివేతను నిర్దేశించి కొనసా గిస్తున్న సామాజిక చలన సూత్రాలను కనిపెట్టాలనే తీవ్రమైన కోరిక కలిగినప్పుడు

ఆ సంక్షోభంలో సంఘర్షణ పడతారు. సంఘర్షణకు పూనుకోవటమే స్వేచ్ఛాకాంక్షకు సంకేతం. వ్యక్తుల స్వేచ్ఛా కాంక్షకూ, సాంఘికంగా వుండే కట్టుబాట్లకూ ఒక ఘర్షణ ఎప్పుడూ వుంటుంది. స్త్రీల విషయంలో ఈ ఘర్షణ మరింత ఎక్కువ. ఈ ఘర్షణ చాలా విలువైనది. సమాజం మరింత ప్రజాస్వామికంగా మారటానికీ వ్యక్తుల జీవితాలు మరింత సుఖంగా సాగటానికీ ఈ ఘర్షణ అత్యవసరం. అందరికీ ఆమోదయోగ్యమైన విధానం ఏదీ వుండదు. వ్యక్తుల స్వేచ్ఛకూ సామాజిక బాధ్యతలని మనం అనుకునేవాటికి మధ్య వుండే ఘర్షణను రాజకీయం చేసుకోవటంలోనే స్త్రీవాదం ప్రత్యేకత వుంది.

ఈ నవలలో అరుణ ఈనాటి మధ్యతరగతికి చెందిన ఆధునిక స్త్రీ. ఈ స్త్రీలు చదువుకుంటున్నారు. రకరకాల ఉద్యోగాలు చేసి ఆర్థికంగా స్వతంత్రులమనుకుంటున్నారు. వాళ్ళ చదువుల్లో ఉద్యోగాల్లో వాళ్ళకు వచ్చే గుర్తింపు, కొంచెం పెరిగిన వారి చోటూ, స్వతంత్రంగా ఆలోచించగల బుద్ధీ, దానివల్ల పెరిగిన ఆత్మ గౌరవం, రకరకాల సాంఘిక సంబంధాలలోకి వెళ్ళే అవకాశం యివన్నీ కలిసి వాళ్ళను ప్రభావితం చేస్తాయి. వాళ్ళ స్వభావాన్నీ, జీవితం పట్ల వాళ్ళ దృక్పథాన్నీ మారుస్తాయి. కుటుంబం గురించీ, అందులోని అధికారం గురించీ సంప్రదాయ భావాలకు తలవంచక కొత్త ఆలోచనలు చేస్తారు. సాంస్కృతికంగా తమమీద రుద్దబడిన భావజాలాన్ని ప్రశ్నించటం ప్రారంభమవుతుంది. ఎప్పుడైతే అసలులో వున్న భావజాలాన్ని ప్రశ్నించారో అప్పుడు వ్యక్తిగత స్థాయిలోనూ సామాజిక స్థాయిలోనూ ఘర్షణ మొదలవుతుంది. ఇంట్లో విధేయంగా అణిగి మణిగి పరాధీనగా వున్న స్త్రీ ఉద్యోగంలో ధైర్యంగా, నైపుణ్యం గలదానిగా, పట్టుదలతో లక్ష్యం సాధించేదానిలా, తెలివితో, బాధ్యతతో ప్రవర్తించాలి. ఉద్యోగంలో, సమాజంలో యింత తెలివిగా బాధ్యతగా ప్రవర్తించటం నేర్చుకున్న స్త్రీ ఆ తెలివినీ బాధ్యతనూ యింటికి కూడా తీసుకువస్తుంది. ధైర్యంగా ప్రశ్నిస్తుంది కుటుంబ పెద్దలను. దానితో వస్తుంది పేచీ. దాదాపు యాభై సంవత్సరాలుగా సాంఘిక జీవితంలోకి, వుద్యోగ వ్యవహార రంగాలలోకి స్త్రీలు రావటం రోజు రోజుకీ పెరుగుతోంది. స్త్రీల మీద అనేక కొత్త విధులు, పనులు వచ్చి పడుతున్నాయి — పాతవి మాత్రం ఒక్కటి కూడా వదిలిపోవటం లేదు. ఈ మొత్తం బరువుతో ఉక్కిరిబిక్కిరవుతున్న స్త్రీలు ఆ బరువుని దించుకునే మార్గాల కోసం వెదుకుతున్నారు. తమని తాము పోషించుకుని, రక్షించుకోగలమనుకున్న స్త్రీలు దృష్టిని తమ మీది నుంచి సమాజం మీదకు

మళ్ళిస్తున్నారు. ఇట్లాంటి కొత్త స్త్రీలు పడే క్షోభనూ, ఎదుర్కొనే సమస్యలనూ కొంతవరకు పట్టుకోగలిగింది 'స్వేచ్ఛ' నవల.

అరుణ చిన్నతనం నుంచీ తను అణచివేతకు గురవుతున్నానని గుర్తించింది. ఆ అణచివేతనుండి బయటపడే ప్రయత్నాలు చేసింది. ఆ ప్రయత్నాలు ఒకసారి మళ్ళీ ఆమెను అణచివేత చట్రంలోకే తీసుకొచ్చి పడేశాయి. తండ్రి, మేనత్తల ఆంక్షలు పోతే, తనకు ఆర్థిక స్వాతంత్ర్యం వుంటే తన జీవితం హాయిగా సాగుతుందని మొదట అనుకుంది. ఆ రెండూ సాధించింది. ప్రకాశాన్ని పెళ్ళాడటం ద్వారా స్వేచ్ఛ పొందాననుకున్న ఆమె భ్రమలు రెండు నెలల్లోనే ఒదిలి పోయాయి. ఆమె గర్భవతి అయితే — అబార్షన్ చేయించుకోవాలంటే వీలుకాదన్నాడు ప్రకాశం. వీలు కాదని అనటంలో అతను చూపిన అధికారం అరుణను చాలా కలవరపరిచింది.

తను ఉద్యోగం చేసినా, బయటి ప్రపంచంతో సంబంధాలలో వున్నా తన ప్రధాన కర్తవ్యం మాతృత్వమేనని అరుణకు తెలిసి వస్తుంది. అలాగే తన సంపాదన మీద తనకు అధికారం లేదనీ, తనకు కుటుంబంనుంచి విడిగా, ఒక వ్యక్తిగా సమాజంతో ప్రత్యక్ష సంబంధంలోకి వెళ్ళే వీలుకూడా లేదనీ తెలుస్తుంది. ఈ విషయాలేమీ లేకపోతే వీటిని పట్టించుకోకపోతే జీతం తెచ్చి భర్తకిచ్చి, పిల్లల్ని కని, వారిని చదివించుకుంటూ, యింట్లో ఎవరికీ ఏ లోటూ లేకుండా చేస్తే ఆమె జీవితం "శాంతి"గా సాగిపోయేదే. ప్రకాశం చాలా మంచి మగవాడు అయ్యేవాడే. ఎప్పుడైతే అరుణ తనో ప్రత్యేక వ్యక్తిననీ, తనకు కొన్ని అభిరుచులూ, ఆసక్తులూ, శక్తులూ వున్నాయనీ, తనను తాను నిరూపించుకోవాలనే కోరిక వుందనీ గ్రహించిందో— వ్యక్తిగా తన మనుగడకు అవి అత్యంత అవసరమని గ్రహించిందో అప్పుడు ఆమె కుటుంబంలో శాంతి లోపించింది. ఇక్కడ మనకు రెండు విషయాలు అర్థమవుతున్నాయి. ఒకటి కుటుంబం వ్యక్తిగా స్త్రీకుండే చోటును లేకుండా చేస్తుంది. రెండవది- అట్లా చేసి ఆమెను వ్యక్తిగా సంహరించటంవల్లమాత్రమే తను శాంతిగా స్థిరంగా వుండగలుగుతుంది. మళ్ళీ మళ్ళీ యిదే సంహారక్రియను కొనసాగిస్తూ బలంగా స్థిరపడుతుంది కుటుంబం. కొంతవరకు యిది గ్రహించిన అరుణ కుటుంబాన్ని వదిలి వచ్చింది.

ఇట్లా ఒక మామూలు మధ్య తరగతి స్త్రీ అతి మామూలు విషయాలకు, అన్ని కుటుంబాల్లో సర్వ సాధారణంగా జరిగే విషయాలకు—ప్రత్యక్షంగా కొట్టొచ్చి

నట్లు కనపడని హింసనూ, అందరికీ మామూలైపోయి, న్యాయబద్ధంగా, ధర్మబద్ధంగా అనిపించే హింసనూ పైకి తీసి పెద్ద విషయాలుగా చూపించటంతో చాలా మంది భరించలేకపోయారు. ప్రకాశం వంటి 'మంచి భర్త'నే ఒద్దనుకుంటే మరి తమ సంగతేమిటనేది అంతరాంతరాలలో అందరినీ వేధించింది. ఇట్లా సమాజంతో సంబంధం కావాలని కుటుంబాలను వదిలితే కుటుంబ వ్యవస్థ ఏం కావాలని గగ్గోలు పడిపోయారు.

అరుణ కుటుంబాన్ని ఒదిలి వూరుకోలేదు. సమాజంలో చైతన్యం తీసుకు రావటం కోసం పని చేస్తున్న సంఘాలు ఆడవాళ్ళ పట్ల ప్రవర్తించే తీరుని కూడా ప్రశ్నించింది. తనను వ్యక్తిగా కాక ఒకరి భార్యగా మాత్రమే చూసి ఆ భార్యాత్వమే తనకు ముఖ్యమని చెప్పబోయిన సంఘాన్ని కూడా ఒదిలేసింది. ఈ సంఘటన రాజకీయ పార్టీల వారి గొంతుకడ్డం పడింది. ఎందుకంటే వామపక్ష రాజకీయ పార్టీలలో కూడా స్త్రీ స్థానం చర్చనీయాంశమే. విప్లవోద్యమాలలో, విప్లవ సంఘాలలో పని చేసిన స్త్రీలకు ఆయా వుద్యమాలలో కూడా అధికారాలూ, పెత్తనాలూ, ప్రతికూలతలే ఎదురయ్యాయి. స్త్రీలు 'మంచివారు'గా 'కుటుంబ స్త్రీలు'గా మాత్రమే తమ సంఘాలలోకి వచ్చి పని చేయాలనీ, తమ సంఘాల 'పరువు' కాపాడాలనీ, కుటుంబ గౌరవం కాపాడుకోవాలనీ- ఇట్లా స్త్రీల గురించి రాజకీయ పార్టీలు మరో రాజకీయ కుటుంబ భావజాలాన్ని తయారు చేసుకున్నాయి. ఆ ధోరణిని ఎత్తి చూపి విమర్శించిన నవలగా 'స్వేచ్ఛ' వారికి కంటకప్రాయమైంది. అరుణ తను పని చేస్తున్న సంఘాన్నుంచి బైటికి వచ్చేసింది గాబట్టి వ్యక్తివాది అనీ- ఈ నవల వ్యక్తివాదాన్ని ప్రోత్సహిస్తుందనీ అనేసి తమ భారాన్ని దించుకోజూశారు పది సంఘాలూ, పార్టీలూ మారినవారు కూడా. తాము పార్టీల నుంచీ సంఘాల నుంచీ బైటికి వస్తే అది సిద్ధాంత విభేదాల వల్లననీ, అరుణ అతి చిన్న వ్యక్తిగత విషయానికి వచ్చేసిందనే వారికి "వ్యక్తిగతం కూడా రాజకీయమే"ననే రాజకీయ సిద్ధాంతాన్ని అర్థం చేసుకోమని చెప్పటమే ఈ నవల ఉద్దేశమని మళ్ళీ గుర్తు చేస్తున్నా. అరుణ కూడా తమలాగే తనకు నచ్చని సంఘం నుంచి వచ్చిందనీ, స్త్రీలకు కూడా అధికారం చోటూ వుండే సంఘాన్ని నిర్మించే ఆలోచన ఆమెకు కలిగిందనే విషయాన్ని దొత్తిగా గమనించరు. గమనిస్తే తమ తప్పులు ఒప్పుకోవాలి. ఈ ఏడేళ్ళుగా రాజకీయ పార్టీల్లో స్త్రీల స్థితిని గురించీ, 'స్వేచ్ఛ' నవల లేవెత్తించిన ప్రశ్నల గురించి చర్చలు జరుగుతూనే

వున్నాయంటే ఈ ప్రశ్నలు వాస్తవమైనవనే విషయం యిప్పటికైనా అందరూ గుర్తిస్తున్నారని నమ్ముతున్నాను.

మొత్తానికి కుటుంబాల్లో, రాజకీయాల్లో స్త్రీల అనుభవాలను స్త్రీల దృష్టినుంచి చెప్పి ఆ అనుభవాల సారాంశాన్ని కొత్త పద్ధతిలో అర్థం చేసుకోవాలని సూచించటం ఈ నవలలో బలం. పురుషాధిపత్యాన్ని సమర్థించేవారికి నచ్చని అంశం కూడా అదే.

ఈ నవలలో ఉమ పాత్ర పెళ్ళి ఒద్దనుకుని తను ప్రేమించిన యువకుడితో కొత్త పద్ధతిలో జీవితం గడిపే పాత్ర. నిజానికి పెళ్ళితో స్వతంత్రం పోతుందనుకుని పెళ్ళి ఒద్దనుకున్న పాత్రలు తెలుగు సాహిత్యానికి కొత్త కాదు. కొడవటిగంటి కుటుంబరావుగారి నవలలు 'సీతం కావాలి'లో కస్తూరి, 'ఎండమావులు'లో సుందరం యిలాంటివాళ్ళే. ఐతే ఆ పాత్రలు కుటుంబ జీవితానికి వెలుపలవున్న పాత్రలు. వేశ్యావృత్తి నుండి వచ్చిన పాత్రలు. అందువల్ల ఆ అభిప్రాయాలు ఎవరినీ పెద్దగా కలవరపెట్టలేదు. వేశ్య పెళ్ళి చేసుకోకపోతేనే కుటుంబ వ్యవస్థకు భద్రత కదా? కానీ కస్తూరినీ, సుందరంనూ ఆదర్శంగా తీసుకుని కుటుంబ స్త్రీలు కూడా పెళ్ళి లేకుండా మగవాళ్ళతో సంబంధంలో వుండటానికి సిద్ధపడతారని కొడవటిగంటిని అభిమానించే పాఠకులు వూహించి వుండరు. ఉమలాంటి మంచి కుటుంబం నుంచి వచ్చిన అమ్మాయి, విద్యాధికురాలు పెళ్ళి ఒద్దని, నచ్చినవాడితో ప్రేమ జీవితం తప్ప కుటుంబం ఒద్దనుకోవటం చాలా కల్లోలాన్ని రేపింది. పిల్లల సంగతేమిటనే ప్రశ్న వచ్చింది. ఆ ప్రశ్న 'స్వేచ్ఛ' నవల నుండి 'ప్రయోగం' కథ వరకూ వేధిస్తూ వస్తూనేవుంది. మగవాడిని ఒక యింట్లో కట్టెయ్యకపోతే యిక్కడ ఈమెకు పిల్లల్నికని, యింకోచోట యింకొకరికి కని యిలా పిల్లల్ని కంటూ పోతే ఆ ఆడవాళ్ళందరూ అతని పిల్లల్ని పెంచాలా అనే చౌకబారు ప్రశ్నలు కూడా వచ్చాయి. ఇలాంటి మగవాళ్ళ అమాయకులైన ఆడవాళ్ళనిలా అవస్థల్లో పడేస్తూనే వున్నారు అనేది ఒక విషయమైతే, అవకాశం వస్తే ప్రతి మగవాడూ యింత హీనంగానే ప్రవర్తిస్తాడని అనుకునే వీళ్ళు స్త్రీవాదులను పురుషద్వేషులనటం యింకో విషయం. నిజానికి ఈ ప్రశ్నలు అడగాల్సింది అట్లాంటి పురుషుల్ని. పురుషుల బాధ్యతారాహిత్యాన్ని పట్టించుకోకుండా పిల్లల బాధ్యతనంతా స్త్రీలమీదనే పడెయ్యటం, ఆ పని స్త్రీలదే అన్నట్లు మాట్లాడటం అంటే పురుషుల ప్రయోజనాల్ని కాపాడటమే ఔతుంది.

విద్యాధికురాలై, పెళ్ళి ఒద్దనుకుని, తన జీవితం గురించి తనే నిర్ణయాలు తీసుకునే స్వతంత్ర స్త్రీ, బాధ్యత గుర్తించిన స్త్రీ, తను ఎవరితో సంబంధంలోకి వెళ్ళబోతోందో ఆ పురుషుడిని అన్నివిధాలా గమనించి, అర్థం చేసుకుని మాత్రమే అతనితో సంబంధంలోకి వెళ్తుంది. ఆమెకు తెలివి, పిల్లల బాధ్యత గురించి మగ వాళ్ళను అడిగే ధైర్యం, వారికి సమానంగా బాధ్యతలు పంచే నేర్పు వుంటాయి. అమాయకంగా పురుషుల మాయ మాటలకూ, పెళ్ళి చేసుకుంటానన్న కపట వాగ్దా నాలకూ, పెళ్ళాతి పిల్లల్నికని వారిని పట్టించుకోని వంచనకు బలైపోతున్న స్త్రీలకూ- చాలా బాధ్యతగా తమ జీవితాల గురించి ఆలోచించుకొని, ఎంచుకుని, అవతలి పురుషుణ్ని అంచనావేసి అప్పుడు మాత్రమే పిల్లల్ని కనాలనే స్త్రీలకూ తేడా చూడ కుండా స్త్రీలంటే మోసపోయే తెలివిహీనులుగానే పరిగణించి మాట్లాడరాదు. పిల్లల్ని కనటం ఎంత బాధ్యతో, వాళ్ళను పెంచటానికి ఎంత సహనం వుండాలో తెలియ కుండా, అసలు పిల్లల్ని కనటం గురించి ఏమీ తెలియకుండా తల్లులయ్యే స్త్రీల గురించి బాధపడాలి, భయపడాలి గాని, బాధ్యతతో ఆ పని ఆలోచించి చేస్తామనే స్త్రీల గురించీ, ఆ పద్ధతి గురించీ భయపడటం ఎందుకో అర్థం కాదు. అమాయకు లైన స్త్రీలు కూడా యిలాంటి తెలివి శక్తియుక్తులూ తెచ్చుకుని తమ జీవిత గమ నాన్ని తామే నిర్ణయించుకునే చైతన్యం పొందాలని ఈ విమర్శకులు కోరుకోరా? అమాయకంగా మోసపోయే స్త్రీల బాధల్ని హృదయ విదారకంగా రాయటం వల్ల ఒకరకమైన ప్రయోజనం నెరవేరితే, ఉమ వంటి పాత్రల్ని సృష్టించటం వల్ల మరో రకమైన ప్రయోజనం నెరవేరుతుంది. ఒక కొత్త ఆలోచన వినగానే కలిగే సహజ మైన భయం తప్ప ఈ విమర్శలకు మరో ఆధారం లేదు. నిజానికి యిలాంటి విమర్శలూ, చర్చలూ చాలావరకు అకడమిక్ చర్చలే. ఈ సమాజపు కట్టుబాట్లు తమ అభివృద్ధికి ఆటంకమని గ్రహించి, సమాజం సృష్టించిన నమూనాలో యిమడ లేక సంఘర్షణ పడే స్త్రీలు ఎప్పుడూ వుంటారు. వాళ్ళ కొత్త భావాలనూ, కొత్త ఆచరణనూ అకడమిక్ చర్చల పరిధులకు అవతల సృష్టిస్తూనే వుంటారు. Simon de Boauvoir అన్నట్లు "మన జీవిత పరిస్థితుల గురించిన సరైన జ్ఞానం నుంచే మనం జీవించే శక్తిని మన జీవన సరళికి కారణాలనూ సంపాదించు కోవాలి." అలాంటి జ్ఞానాన్ని సంపాదించుకోవాలనుకునే స్త్రీలకు తమ జీవిత పరి స్థితులను అర్థం చేసుకోవటంలో ఏ కొంచెం సహాయపడినా ఈ నవల ప్రయోజనం నెరవేరినట్లే.

ఈ నవల అరుణకు గానీ ఉమకు గానీ అటువంటి స్త్రీలకు గానీ ఏ పరిష్కారాన్ని అందించింది అనేది చాలామంది అడిగే మరో ప్రశ్న. అసలు రచయితలను సమస్యలకు పరిష్కారాలు, అందులోనూ సరైన, కరెక్టయిన, ఏ పొరపాటూ లేని పర్ఫెక్టు పరిష్కారాలు అడగటం, వాటికోసం రచనల్లో వెతకటం చాలా తెలివి తక్కువతనం. అట్లా వెతకొద్దని కొడవటిగంటి కుటుంబరావుగారు ఎన్నడో చెప్పారు తన సాహిత్య ప్రయోజనం వ్యాసాలలో. అదట్లా వుంచి స్త్రీల సమస్యలుగా కనపడే పునరుత్పత్తి రాజకీయాలు లేవదీసే ప్రశ్నలకు వ్యక్తిగత స్థాయిలో సమాధానాలూ, పరిష్కారాలూ చెప్పలేము. ఒక వ్యక్తి తన సమస్యను చాలా సమర్థతతోనో, తెలివిగానో పరిష్కరించుకున్నట్లు రాసినంత మాత్రాన అది నిజమైన పరిష్కారం, అందరికీ వర్తించే మార్గం అవదు. స్త్రీ స్వేచ్ఛ గురించీ, లైంగిక పునరుత్పత్తి హక్కుల్ని గురించి రాసే రచయిత చేయగలిగిందేమిటంటే యింతవరకూ వ్యక్తిగతమైన విషయాలు, ప్రైవేటు విషయాలు అనుకుంటున్న వాటిని బయటికితీసి సాంఘిక విషయాలుగా నిరూపించి సాంఘిక పరిష్కారాల కోసం వెదకమని సూచించటం. ఆ పని సమర్థవంతంగా చేయటంలోనే నేటి స్త్రీవాద రచయితల విజయం, బలం కనిపిస్తాయి. 'స్వేచ్ఛ' నవల అలాంటి ప్రయత్నమే.

— ఓల్గా

మధ్యాహ్నం పన్నెండు గంటలు కావస్తోంది.

అరుణ మాటిమాటికీ గడియారం వంకా గేటు వంకా చూస్తోంది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుండటంతో గోడ గడియారం చప్పుడు చాలా స్పష్టంగా వినిపించి అరుణ చికాకును మరికాస్త పెంచింది.

రోజూ ఆ వేళప్పుడు ఆ ఇంట్లో ఆ నిశ్శబ్దం మామూలే.

అరుణ తండ్రి జానకిరామయ్య, అన్న గోపాల్రావూ పని గంటలకంతా ఆఫీసుకి వెళ్ళిపోతారు.

గోపాల్రావు కొడుకులిద్దరూ బడికి పోతారు.

తల్లి సీతమ్మా, వదిన సుశీలా కూడా భోజనాలు ముగించి ఏ పప్పులు బాగు చేసుకోవటమో, బట్టలు కుట్టటమో చేసి బద్దకంగా నడుం వాలుస్తారు.

పిల్లలు మళ్ళీ మూడు గంటలకుగాని రారు.

అప్పటివరకూ వాళ్ళకు విశ్రాంతి.

అరుణ ఇంట్లో పనులన్నీ చేస్తుందిగానీ మధ్యాహ్నం భోజనాలయ్యాక చేసే పనులంటే చిరాకు ! ఏ పుస్తకమో తీసుకుని చదువుకుంటూ నిద్రపోతుంది.

మామూలుగా అరుణకు కాలేజీ, చదువూ, పరీక్షలూ వీటితో ఇంటిలో గడిపే సమయం తక్కువే. శలవల్లో పగలంతా ఇంట్లో కూర్చోవాల్సివచ్చినపుడు అరుణకు వూపిరాడనట్లే వుంటుంది.

ఎమ్. ఏ. ఫైనల్ పరీక్షలయ్యి పదిరోజులే అయినా పది నెలలయినట్లుగా వుంది అరుణకు. స్నేహితురాలు ఉమ ఎమ్మెస్సీ పరీక్షలు క్రితంరోజే పూర్తయ్యాయి. ఉదయం పదిగంటలకే వస్తానన్న ఉమ పన్నెండవుతున్నా రాలేదని అసహనంగా చూస్తోంది అరుణ.

మేనత్త కనకమ్మకు అటు ఇంటిపనిగానీ ఇటు బైటపనిగానీ వుండదు. ఇంట్లో మిగిలిన వాళ్ళు యే యే సమయాల్లో ఏమేం చేస్తున్నారో కనిపెట్టి చూసి, ప్రతిదానినీ విమర్శించటమే ఆమె పని.

ఆవిడ అరుణ అసహనాన్ని గమనించనే గమనించింది.

"ఊరికే వాకిలి వంకా గడియారం వంకా చూడకపోతే డాబా మీదున్న వడియాలు తెచ్చి వలవరాదే అరుణా" అందావిడ.

అరుణకు ఆవిడతో మాట్లాడటమన్నా వాదన పెంచటమన్నా చాలా చిరాకు. ఆమె చెప్పే పనుల్లో చెయ్యటానికి వీలైనవి వుంటే చేసేస్తుంది. లేకపోతే తనని కాదన్నట్లు మాట్లాడకుండా ఊరుకుంటుంది.

అరుణ మౌనం కనకమ్మని రెచ్చగొట్టి అరుణ నిర్లక్ష్యాన్ని గురించి గొడవ చేయిస్తుంది.

కానీ ఆమె ఎంత అరచి గీపెట్టినా, ఇంట్లో వాళ్ళంతా తిట్టినా సరే అరుణ మాత్రం పెదవి విప్పదు.

ఇప్పుడు అరుణ వెళ్ళి ఆ వడియాలేవో తేకపోతే ఆవిడ వడియాల పురాణం మొదలెడుతుంది.

అరుణ వయసుకి తానెన్నిసార్లు వడియాలు పెట్టింది ?

వడియాలు పెట్టందే ఆడపిల్ల ఎందువల్ల ఆడపిల్ల అనిపించుకోదు ?

అరుణ ఆడపిల్ల కాకుండా బరితెగించిపోతున్న తీరు ఎలాఉంది ?

ఇవన్నీ ఏకరువు పెడుతుందామె ! ఆపటం ఎవరి తరమూ కాదు.

అందుచేత అరుణ గబగబా డాబా మీదకు వెళ్ళింది. మంచాల మీద తెల్లటి పంచెలు పరిచి వాటిమీద చిన్న చిన్న వడియాలు పెట్టారు. ఆ తెల్లటి పంచెలమీద వడియాలు మెరుస్తున్నాయి చిత్రంగా.

అరుణ కాసేపు వాటిని చూసి ఆ పంచెలన్నీ తీసి మడిచింది. మెట్ల దగ్గర కాస్తనీడగా అనిపిస్తే అక్కడ నుంచుని వీధిలోకి చూసింది.

"ఉమ ఎప్పుడూ ఇంతే. చెప్పిన టైముకి ఎక్కడికీ రాదు.

అసలు ఇంకొకరి కోసం ఎదురు చూసే పని పెట్టుకోకూడదు. అయినా ఇవాళ వెళ్ళిపోతోంది గదా- తొందరగా వస్తే ఇంకో గంట ఎక్కువ కలిసి వుండొచ్చు అనుకోదం" అని ఉమ మీద మనసులోనే విసుక్కుంది.

ఎందుకో వీధి వైపు వచ్చిన మేనత్త డాబామీద నుంచుని వీధిలోకి చూస్తున్న అరుణని చూసింది. "ఏమిటా డాబా మీద నుంచుని చూడ్డం ! పనయిపోగానే కిందకి దిగవేం. దిగూ కిందికి" అని అరిచినంత పని చేసింది.

"అబ్బా అసలీ అత్త మనింట్లో ఎందుకుంటుందే" అని పూహ వచ్చిన మొదట్లో తను అమ్మనడగడం అరుణకింకా బాగా గుర్తుంది.

"ఊరుకోమ్మా. వింటంటే కొంపలంటుకుంటాయ్" అంది అమ్మ.

అత్త విననే వింది.

అసలావిడకు ఎవరు ఎప్పుడు ఏం మాట్లాడుకున్నా తెలిసిపోయేవి. ప్రతి విషయం మీదా తన అభిప్రాయం చెప్పి "అయినా నాకెందుకులే- తలచెడిన ముండని" అనేది.

ఆ రోజు పెద్ద రభసయింది. ఆఫీసు నుంచి తండ్రి వచ్చేవరకూ అదీ ఇదీ సణుగుతూనే వుంది.

"ఏదో చిన్నపిల్ల తెలవక అడిగింది. పోనివ్వరాదూ" అని అమ్మ బతిమాలు కుంది కూడా.

"చిన్నపిల్ల దానికేం తెలుస్తుందీ పెద్దవాళ్ళ కడుపుల్లో మాటలే పిల్లల నోట్లో నుంచి వస్తాయి" అని సాధించింది కనకమ్మ.

సీతమ్మ మళ్ళీ నోరు విప్పలేదు. జానకీరామయ్య ఇంట్లో కొచ్చి ఇంకా కాళ్ళన్నా కడుక్కోనేలేదు. ఏడుపులతో మొత్తుకోళ్ళతో స్వాగతం పలికింది కనకమ్మ.

ఆయన ఇంతెత్తున ఎగిరి ఎక్కడ తగుల్తుందో కూడా చూడకుండా అరుణని బాదాక అప్పుడు నోరువిప్పింది మళ్ళీ.

"ఊరుకోనాయనా. తలచెడి ఒకరి పంచన చేరనే కూడదు.... చేరాక ఇటు వంటి మాటలు పడక తప్పదుమరి. రేపు దానికేమన్నా అయితే మేనత్తవుండ పసి ముండని పొట్టన పెట్టుకుందంటారు. వూరుకో. ఒకర్నన్నేం లాభం. నా కర్మిట్లా కాలింది మరి" అని దీర్ఘం తీసిందామె.

ఆ రోజు రాత్రి మంచం మీద అరుణని కౌగలించుకు ఏడుస్తూ పడుకుంది సీతమ్మ. తండ్రి వచ్చి మళ్ళీ సీతమ్మని తిట్టాడు.

అప్పట్నించీ అరుణ మేనత్తని ద్వేషిస్తూనే వుంది. ఆ ద్వేషం రోజు రోజుకీ పెరిగిందేగాని తరగలేదు. తండ్రి తల్లీ మేనత్తంటే ఎందుకో భయపడడం అరుణ చిన్నప్పుడే కనిపెట్టేసింది.

పెద్దయ్యాకగాని ఆ భయం ఎందుకో అర్థంకాలా.

కనకమ్మకి చిన్నప్పుడే పెళ్ళయింది. కాపురానికి వెళ్ళకుండానే భర్త పోయాడు. భర్తనుంచి వచ్చిన ఐదెకరాల మాగాణి భూమితో సహా తమ్ముడిల్లు చేరింది కనకమ్మ. ఆవిడ పొలం మీద ఆశతో జానకిరామయ్య ఆమెమాట జవదాటేవాడుకాదు. సీతమ్మని నోరెత్తనిచ్చేవాడు కాదు.

అత్త ఏమన్నాసరే తల్లిదండ్రీ నోరుమూసుకు పడుండేది ఇందుకేనని తెలుసుకోవటం అరుణకి కష్టమనిపించినా అది వాస్తవం.

చిన్నప్పటి నుంచీ బొట్టూ పూలూ పెట్టుకోకుండా రంగురంగుల బట్టలేసుకోకుండా, ఏ చిన్న ముచ్చటా లేకుండా జీవితం గడుపుతున్న కనకమ్మకి లోకంలో ఏ ఆడది కొత్త పచ్చగా వున్నా గుండెలు భగ్గుమనేవి.

మరి మారిన రోజుల ప్రకారం ఆడది గడపదాటి చదువులకని బైటికెళ్ళడం కనకమ్మ కసలు పడేదికాదు. మూడో క్లాసు దాటిన దగ్గర్నుంచి ఆడపిల్ల చదువులు మాన్పించమని నిరంతరం పోరుతుండేది.

అరుణ అక్క రాజేశ్వరి ఈ పోరాటాల మధ్యలోనే ఎనిమిదో తరగతి దాకా ఎలాగో నడిపించింది.

ఆ తర్వాత కనకమ్మ బాధ తట్టుకోలేక రెండేళ్ళలో పెళ్ళి చేసి పంపించేశాడు జానకిరామయ్య.

అరుణ ఎనిమిదో క్లాసు కొచ్చేసరికి....

"ఇంకెన్నాళ్ళులే ఈ తిప్పుళ్ళూ ఎగురుళ్ళూ. అన్నీ పోతాయి ఆ మూడు ముళ్ళూ...." అని మొదలెట్టేది కనకమ్మ.

"చిన్నమ్మాయి పెద్దదానిలా కాదులే. దీనికి బాగా చదువొస్తుంది" అని గొణిగేవాడు జానకిరామయ్య.

అసలు విషయం ఇల్లు కట్టుకోటానికి అయిన అప్పులతో సతమతమవుతున్న ఆయనకు అరుణ పెళ్ళి చేసే శక్తిలేదు.

"ఎందుకూ చదువంటి చదువు. నాకు తెలిసి చదువుకున్న ఏ ఆడదీ బాగుపడలా. ఇది సంసారం చెయ్యదా? సంసారాలు చేసుకునే వాళ్ళకి చదువులు అచ్చిరావు" అని కరాకండిగా తన అభిప్రాయం చెప్పి,

"అయినా నాకెందుకులే. చదివించుకునే వాడివి నువ్వూ చదువుకునేది అదీనూ.

తల్లి వుండడంచే ఆవిడకి పిల్ల ఏమయిపోయినా పట్టదు. నాకు తెలవకడుగుతా రేపే దన్నా అయితే మొకాలెక్కడ పెట్టుకుంటారూ ?" అని మొదలెట్టేది.

అరుణ వేసే ప్రతి అడుగు లెక్కపెట్టి సాధించి పెట్టేసి. "ఏమిటా నిట్టలు తొక్కడం.... చురుగ్గా వుండాలి. ఇట్టావుంటే పనులవుతాయా- ఏమనడకలు ఏమ నడకలని ! రేపా చేసుకునేవాడి కింత వుడకేసి పెడతావా లేదా" అనేది.

కాస్త ఒకడుగు ఎక్కువేస్తే.... "ఏమిటా పరుగు ఆడపిల్లవు కాదూ. నిదా నం కూడా లేకపోతే ఇకా వచ్చేవాడు ఏం చూసి చేసుకుంటాడు విన్నావా" అని సాధించేది.

ఇంట్లో వున్నంతసేపూ తన ప్రతి కదలికా అత్త రికార్డు చేస్తోందనే స్పృహ అరుణకి పెద్ద నిస్పృహ కలిగించేది.

ఎస్సెల్సి పూర్తయి కాలేజీలో చేరిన దగ్గర్నించీ కనకమ్మ జాడ్యం తల్లీ తండ్రీ అన్నా వదినల కందరికీ అంటుకుంది.

అరుణ తీసే పాపిరి, వేసే అడుగూ, పోసుకునే నీళ్లూ, రాసుకునే పౌడరూ అన్నీ ఎవరికో ఒకరికి అభ్యంతరకరంగా కనిపించేవి.

ఏ విషయంలోనూ అంగీకారంలేని పెద్దలు తనని సతాయించడం దగ్గరికొచ్చే సరికి, తనని అదుపులో పెట్టడం దగ్గరికొచ్చే సరికి, తనకి బుద్ధులు చెప్పడం దగ్గర కొచ్చేసరికి ఏకాభిప్రాయానికి వచ్చేసేవారు.

కనకమ్మయితే అరుణని అవమానించడానికే పుట్టినట్టు ప్రవర్తించేది.

అరుణకింకా బాగా గుర్తుంది.

అప్పుడు తను టెన్త్ క్లాసు చదువుతోంది.

ఓ రోజు స్కూలు నుంచి ఇంటికొచ్చింది. అందరు ఆడపిల్లల్లాగే పుస్తకాలను గుండెలకానించుకొని నడుస్తూ వచ్చింది.

ఎప్పుడు అరుణ స్కూలు నుంచి వస్తుందా ఏ తప్పు పట్టుకోగలనా అన్నట్టు చూస్తున్న కనకమ్మ కళ్ళు అరుణ గుండెల మీదున్న పుస్తకాల మీద పడ్డాయి.

"వయసొచ్చిన పిల్ల చదివింది చాల్లే అని ఆ మూడుముళ్లూ వెయ్యకపోతే ఇంతే. గుండెలమీద మగాడి బొమ్మనేసుకుని ఆ తైతక్కలేంటి- సిగ్గులేకపోతేసరి" అంటూ ప్రారంభించింది. అరుణ సిగ్గుతో చితికిపోయి పుస్తకాలు గబుక్కున కింద పడేసింది.

పై పుస్తకానికి ఎవరో సినిమానటుడి బొమ్మ అట్టగా వేసివుంది.

అదీసంగతి!

అరుణ ఈ ఆలోచనలతో కొట్టుకుపోతూ అవమానంతో వుడికిపోతూ వుండగానే వాకిటి ముందు ఆటో ఆగింది. స్నేహితురాలు ఉమ పెద్ద పెట్టెతో సహా దిగింది.

"ఏమిటీ తల్లీ ఇంతాలస్యం పదిగంటలకు వస్తానని. చూడలేక చస్తున్నా" అంటూ ఉమ పెట్టెకు సాయం పట్టింది.

"ఇదిగో ఈ పెట్టె సర్దుకునేసరికి ఈ వేళయింది. ఈ శలవులు శాశ్వత శలవులుగదా- మొత్తం రూమంతా ఖాళీ చేసి ఈ పెట్టెలో నింపేశా."

ఇద్దరికీ ఒక్కసారి దిగులనిపించింది.

"టికెట్ తీసుకున్నావా?"

"నిన్ననే తీసుకున్నా. రాత్రి తొమ్మిదిన్నరకి బస్సు."

"భోజనం చేశావా?"

"చేశానుగాని కాసిని మంచినీళ్ళివ్వు."

ఈ లోపల అరుణా వాళ్ళమ్మ, వదినా, మేనత్తా ఉమ చుట్టూ చేరారు. సీతమ్మా, సుశీలా కుశల ప్రశ్నలు వేస్తుంటే కనకమ్మ ఉమను నఖశిఖ పర్యంతం పరీక్షించింది. బాగా అలిసినట్లున్నా ఉమ ముఖంలో కనిపించే వుత్సాహం, చురుకుదనం, సంతోషం, సన్నగా నాజూగ్గా వున్న ఆమె ఆకారం- ఇవన్నీ కలిసి కనకమ్మ మనసులో ఏదో అశాంతిని రేపాయి.

అరుణ మంచినీళ్ళ గ్లాసు తెచ్చి ఉమకిచ్చి "కూచో" అంటూ తానూ మంచం మీద కూచుంది.

ఉమకంటే ముందు మిగిలిన ముగ్గురూ మంచం పక్కనే కూచుని అరుణ డాబా మీదనుంచి తెచ్చిన వడియాల చీరల్ని ముందు పడేసుకుని వలవటం మొదలు పెట్టారు.

ఉమ అరుణను చూసి నవ్వింది. అరుణ ఇబ్బంది పడుతూనే—

"నిన్న పరీక్ష ఎలా రాశావు?" అనడిగింది.

"ఫరవాలేదు. అన్నీ అనుకున్న ప్రశ్నలే వచ్చాయి. ఫస్ట్‌క్లాసు వస్తుందిలే దిగుల్లేదు" అంది ఉమ నిర్లక్ష్యంగా.

"ఫస్టుక్లాసు గురించి ఎవరాలోచిస్తున్నారు. గోల్డ్ మెడల్ సంగతేమిటి ?"

"ఏమో- చెప్పలేం. ఆ ప్రేమకుమారుడు గడ్డాలూ, మీసాలూ పెంచి నిద్రాహారాలు మాని తపస్సుచేశాడుగా తన్నుకు పోతాడేమో."

"గడ్డాలకీ మీసాలకీ మార్కులేస్తే ఇంకా చాలామంది కూడా తన్నుకు పోతారేమో."

ఇద్దరూ నవ్వుకుంటుంటే సుశీల చిరాగ్గా గదిలోకి వెళ్ళి పడుకుంది.

"అయ్యో- అవేంమాటలే తల్లీ" అంటూ కనకమ్మ ఏదో మొదలెట్టబోతుంటే అరుణ లేచింది.

"వరండాలో కూచుందాం రా ఉమా" అంటూ తీసుకు వెళ్ళింది.

"మనం వినకూడదమ్మా వీళ్ళ మాటలు" కనకమ్మ సీతమ్మతో అంది.

"ఏమో- ఏం రహస్యాలో"

"నువ్వే హాస్టల్‌కి రావే అంటే వినవు" విసుక్కుంది ఉమ.

"నేను హాస్టల్‌కి రావాలంటే ముందు మా నాన్న దగ్గర్నించీ అన్నయ్య దగ్గర్నించీ పర్మిషన్ తీసుకోవాలి. అది నాకు పెద్ద చికాకు. ఇక నేను బయల్దేరే దగ్గర్నించీ అందరూ ఏదో సణుగుడు. ముగ్గురూ ముగ్గురే- ఎవరి లెవల్లో వాళ్ళు. తీరా వచ్చినా మళ్ళీ సాయంత్రం ఐదుగంటలకంతా ఇంట్లో వుండాలి. నువ్వొస్తే రాత్రిదాకా కలిసి వుండొచ్చు గదా అని."

"సరేలే- ఇక్కడేమో అసలు మాట్లాడుకునే వీలుండదు. పోనీ సినిమాకు వెళ్దామా ?"

"సినిమాకా ?"

"ఏం- పర్మిషన్ కావాలా ?"

"కావాలి. కానీ నువ్వున్నావుగా. నువ్వడుగుతావా మా అమ్మని."

"ఏంటరుణా- చిన్నపిల్లలా ఎమ్మే పాసయినా."

"ఈ ఇంట్లో వున్నంతకాలం నేను చిన్న పిల్లనే. ఈ ఇంట్లో వాళ్ళంతా నన్నూ నా పవిత్రతనూ కాపాడ్డమే ధ్యేయంగా పెట్టుకున్నారు. ఏం చెయ్యను ?"

"ఏం చెయ్యనూ అంటావుగానీ చెయ్యాల్సింది చెయ్యవు. మీ అమ్మతో చెప్పిరా వెళ్ళిపోదాం. ఏమవుతుంది ?"

"నీకు తెలియదు. చాలా గొడవవుతుంది."

"ఐతే అవనీ- కొన్ని గొడవలు ఖరిస్తే తరవాత ఇకవాళ్ళకూ నీకూ కూడా అలవాటవుతుంది. లే- ఇవాళ డ్రైవ్ చెయ్యి సినిమాకు పోదాం" ఉమ అరుణను లోపలికి నెట్టింది.

అరుణ లోపలికి వెళ్ళి అద్దంలో చూసుకుంది. తల బాగానేవుంది. దువ్వ నవసరంలేదు. బొట్టుంది. ఇంత పౌడరు ముఖానికి రాసుకుని చీరమార్చుకుంటుంటే కనకమ్మ రానే వచ్చింది.

"ఎక్కడికి ప్రయాణమవుతున్నావు ?

"సినిమాకి" కుచ్చిళ్ళు సరిచేస్తూ అంది అరుణ.

"సినిమాకా ? మీ నాన్నతో చెప్పావా ?"

"చెప్పలేదు. ఉమ ఇప్పుడే అంది. అమ్మతో చెబుతాలే" అంటూనే వంటగది వైపు నాలుగడుగులు వేసింది.

"అమ్మా- నేను ఉమా సినిమాకు పోతున్నాం. అరింటికి వస్తాం. ఉమ ఇక్కడే భోంచేసి రాత్రికి వెళ్ళిపోతుంది." అంది.

ఆ మాట అనేసి పరిగెత్తుతున్నట్టే బైటికి నడిచింది.

"ఇప్పుడేం సినిమా ?" అంటూ బైటికొచ్చింది సీతమ్మ.

కనకమ్మ గడియారం వంక చూసి

"ఒంటిగంటే అయింది. సినిమా ఏమిటిప్పుడు ? ఎక్కడికి పోతోందో ?" అంది.

అడపడుచు మాటలకు సీతమ్మకు కళ్ళనీళ్ళొచ్చేశాయి.

"దీని మూలాన ఎన్ని మాటలు పడాలో" అంటూ దిగులు పడింది.

సుశీల విసురుగా గది తలుపులు బిగించుకుంది.

నాలుగైదు గజాలు నడిచాక 'అమ్మయ్య' అని నిట్టూర్చింది అరుణ.

"ఏం సినిమాకి పోదాం ?"

"నాకైతే ఏ సినిమాకూ పోదామనిపించటంలా. ఎక్కడన్నా కూచుని కబుర్లు చెప్పుకుందాం !"

"ఎక్కడ కూచుందాం ?"

"యూనివర్శిటీకే పోదామా. గార్డెన్‌లో బాగుంటుంది. మన చెట్టుకిందే కూచుందాం. మళ్ళీ ఎన్నాళ్ళకు కూచుంటామో" ఉత్సాహంగా అంది అరుణ.

"బాగానే ఉంది. నేను పడీపడీ యూనివర్శిటీ నుంచి వస్తే మళ్ళీ యూనివర్శిటీకే పోదామంటావా ? అందుకే అసలు నిన్ను రమ్మంటే–" విసుక్కుంది ఉమ.

"అబ్బ చెప్పానుగా ఉమా- నువ్వు కూడా సతాయించకు."

"సరే. పోదాం పద"

ఇద్దరూ బస్‌స్టాపులోకి నడిచారు.

యూనివర్శిటీ గార్డెన్‌లో ప్రతి స్టూడెంట్‌కి ఒక్కోచోటు యిష్టమై వుంటుంది. ఉమా, అరుణా యిద్దరూ ఎప్పుడూ ఓ మోదుగ చెట్టుకింద కూచుంటారు. వాళ్ళు వచ్చేసరికి ఎవరైనా ఆ చోటులో కూచుంటే వాళ్ళకు చాలా విసుగనిపిస్తుంది. క్లాసులు ఎగ్గొట్టి గంటలు గంటలు ఆ మోదుగ చెట్టుకింద చేరి కబుర్లు చెప్పుకునేవారు.

"మన చివరి సమావేశం ఈ చెట్టుకిందే అవటం బాగుంది" అంది ఉమ చతికిలపడుతూ.

"చివరి సమావేశం, శాశ్వత సెలవులు, ఏమిటీ భాష ? ఇక మళ్ళీ మనం కలుసుకోమా ?"

"కలుసుకుంటాంగానీ యిప్పటిలాకాదుగా. ఎవరం ఎలా మారతామో. ఎక్కడికి వెళతామో"

"నేనెక్కడికీ వెళ్ళను. ఈ ఊళ్ళోనే వుంటా."

"నే చేసుకోబోయేవాడికూడా ఈ వూళ్ళోనే వుద్యోగమైతే నేనూ యిక్కడే వుంటా" వెక్కిరింతగా నవ్వింది ఉమ.

"ప్రకాశానికి ఈ వూళ్ళోనే వుద్యోగం వుందనేగా ! నాకీ హైద్రాబాదంటే యిష్టం. నాకు కొస్త జ్ఞానం వచ్చిన దగ్గర్నించీ యిక్కడే పెరిగాను. అందుకే యిష్టం. ఆ యిష్టానికి ప్రకాశానికీ యేమీ సంబంధం లేదు" ఉడుక్కుంటూ అంది అరుణ.

"సరేగాని మీరు పెళ్ళి విషయం యేమన్నా మాట్లాడుకున్నారా ? అసలా విషయం మాట్లాడుకునే టైం దొరికిందా లేదా ?"

"ప్రకాశం వెంటనే పెళ్ళి చేసుకుందాం అంటున్నాడు. నేనే వాయిదా వేస్తున్నా"

"ఏం—ఎందుకని ?"

"నాకూ-డా వుద్యోగం దొరికాక పెళ్ళి చేసుకుంటే బాగుంటుందనిపిస్తోంది. మళ్ళీ మా యింట్లో చికాకుల్ని తల్చుకుంటే వెంటనే పెళ్ళి చేసుకోవాలనిపిస్తోంది."

ఉమ పెద్దగా నవ్వింది.

"నవ్వుకాదు ఉమా— నా బాధ నీకు అర్థంకాదు. ఏ విషయంలోనూ నాకు స్వేచ్ఛ లేదు. ప్రతి చిన్న విషయానికీ వాళ్ళందరి పర్మిషనూ తీసుకోవాలి. ప్రతి పైసకూ వాళ్ళను అడుక్కో-వాలి. వాళ్ళకి యిష్టముంటే యిస్తారు లేకుంటే లేదు. ఇవాళ సినిమాకు వెళ్దామన్నావు నా దగ్గర పైసాలేదు- ఇప్పుడేకాదు నేనెప్పుడన్నా స్నేహితుల్తో కలిసి సినిమాలకూ క్యాంటీన్లకూ వెళ్ళటం చూశావా ? ఎప్పుడన్నా నీతో ప్రకాశంతో మాత్రం వస్తున్నాను. మీరిద్దరూ ఖర్చు పెడుతుంటే చూస్తూ కూచోవటం నాకెంత హింసగా వుంటుంది ?" అరుణ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"మన మధ్యతరగతి కుటుంబాల్లో డబ్బు చిక్కు-లూ పొదుపూ వుంటాయిలే- దాన్నంత సీరియస్‌గా తీసుకోకు".

"నిజంగా యిబ్బందిగా వుంటే నేను సినిమాలకీ, షికార్లకీ డబ్బడిగి వేధిస్తానా ? నీకు తెలియదు ఉమా. ప్రతి విషయానికీ నేను వాళ్ళమీద ఆధారపడాలి. లేకపోతే నాన్న నెలకో ఇరవై రూపాయలు నాకివ్వటం కష్టం కాదు. అసలు నేను నా స్వంతానికి ఖర్చు చెయ్యటమంటేనే వాళ్లకిష్టం వుండదు. మా అక్క-కిమల్లే పదిహేను సంవత్సరాలకే పెళ్ళిచేసి పంపనందుకు యిపుడు మా మేనత్తకెంత పశ్చాత్తాపంగా వుందో ! అన్నట్టు నేను అమ్మమ్మనయ్యాను తెలుసా ?"

"అదేంటి ?"

"ఏముంది. మా అక్క- రాంచీలో వుంటుందే. ఆవిడ కూతురికి యింకో కూతురు పుట్టింది. మా అక్క-కు పదిహేనేళ్ళకు పెళ్ళి చేశారు. పదహారో యేట కూతురు పుట్టింది. మా బావగారిది మాకంటే సాంప్రదాయిక కుటుంబం. వాళ్ళమ్మాయికి కూడా పదహారోయేటే పెళ్ళిచేసి ఇపుడు తాత అయ్యాడు. ఈ రెండు రోజుల్నించీ యింట్లో మా మేనత్త చేసే గొడవ గొడవ కాదు. అవతల నాకు మనవరాలు పుట్టేసింది- నాకేమో ఇంకా పెళ్ళే కాలేదు. సరైన సంబంధాలూ రాకా,

కట్నాలు పొయ్యలేకా నా పెళ్ళి చెయ్యలేదు. పెళ్ళి కుదరలేదుగదా అని నాన్న ఎలాగో నన్ను ఎం.ఏ. చదివించే ధైర్యం చేశాడు. ఇప్పుడిక దిగులు నాకు పెళ్ళే కాదేమోనని. ఆ దిగుల్ని కోపంగా మార్చి అదంతా నామీద క్రూరంగా చూపిస్తారు వీళ్ళు. ఒక రకంగా ఆలోచిస్తే ఎంత తొందరగా పెళ్ళి చేసుకుని ఆ యింట్లోంచి బైటపడి స్వేచ్ఛ పొందుదామా అని వుంది."

ఉమ మళ్ళీ పెద్దగా నవ్వింది.

అరుణ సీరియస్సయిపోయి "నీకు నవ్వుగా ఉందా? నీకేం- మీ యింట్లో నీకు స్వేచ్ఛ వుంది. మీవాళ్ళు నిన్ను హైదరాబాదులో హాస్టల్లో వుంచి చదివిస్తున్నారు. నాబాధ నీకేం అర్థంకాదు. నేనున్నది యింట్లో కాదు. జైల్లో" అంది బాధగా.

"అదికాదు అరుణా— మీ యింటి సంగతి నాకు తెలియదా? అందుకు కాదు, స్వేచ్ఛ కోసం పెళ్ళి చేసుకుందామనుకుంటున్న నీ ఆలోచనకు నవ్వొచ్చింది."

"అంత నవ్వొచ్చేదేమిటి నా ఆలోచనలో?" చిరాగ్గా అంది అరుణ.

"ఏమిటేంటి? అందరూ పెళ్ళయితే స్వేచ్ఛ పోతుందని గోలపెడుతుంటే నువ్వు స్వేచ్ఛ కోసం పెళ్ళాడతానంటే నవ్వురాదా?"

"నా సంగతి వేరులే-"

"ఏంవేరూ? మీయింట్లో వాళ్ళు మరికాస్త ఎక్కువ కట్టడి చేస్తారుగాని యించుమించు అందరిళ్ళల్లోనూ కట్టడి అనేది అలాగే వుంటోంది. నువ్వనుకునే స్వేచ్ఛ చాలా తక్కువమందికి వుంటుంది. కానీ పెళ్ళయితే ఆ కాస్త స్వేచ్ఛా పోతుందేమో. మీ నాన్నా, అమ్మా, వదినా, అత్తా అందరి పాత్రల్నీ ప్రకాశం ఒక్కడే నిర్వహిస్తాడేమో—" నవ్వింది ఉమ.

"ఛ— ప్రకాశం అలాంటివాడా? నీకు తెలియదా? ఎందుకలా మాట్లాడుతావు?"

"కాదులే— ప్రకాశం మంచివాడేలే. ఐతే పెళ్ళయ్యాక స్వేచ్ఛగా సినిమాలకీ, షికార్లకీ తిరుగుతానంటావ్- కానీ అప్పుడు ప్రకాశంతోనే కలిసి తిరగాలేమో."

"మరెవరితో కలిసి తిరుగుతాను?"

"ఔను- ఎవరితో కల్సి తిరుగుతావు? అపుడు ప్రకాశమే నీ ప్రపంచం ఔతాడు కాబోలు నేనొచ్చి ప్యాసా సినిమా వచ్చిందే మనిద్దరం కలిసి చూద్దాం

రమ్మంటే, ప్రకాశం నేనూ కలిసి చూడాలే— లేకపోతే ప్రకాశం బాధపడతాడు. కోప్పడతాడు. సారీ అంటావు కాబోలు."

"నోర్మ్మయ్- అలా ఏం అనను. ముగ్గురం కలిసి చూద్దామంటాను."

"అంతేగాని ప్రకాశాన్ని ఒదిలి నాతో రావన్నమాట"

"ఏంటే నీ గోల. వస్తాలే. ప్రకాశంతో ప్యాసా సినిమా చూడను. సరేనా ! హైద్రాబాదులో ప్యాసా సినిమా ఎప్పుడొచ్చినా నీకో టెలిగ్రాం యిచ్చి నువ్వొచ్చే దాకా ఆగి, నువ్వొచ్చాక ప్రకాశాన్ని ఒదిలి మనిద్దరం చూద్దాం. సరేనా ?"

ఉమ తెరలు తెరలుగా నవ్వింది.

"ఇక ఆపు నీ నవ్వు" అరుణ చిరాకు పడింది.

"కాదు అరుణా ఇప్పుడు మీ యింట్లోవాళ్ళు వాళ్ళ పరిధిలోనే నువ్వుండాలని అనుకుంటున్నారు. నువ్వా పరిధి ఎక్కడ దాటతావోనని భయపడుతున్నారు. ఈపరిధి నీకు యిష్టంలేదు గనుక నువ్వెలాగోలా బైటపడాలని చూస్తున్నావు. నీకిష్టమైన ప్రకాశం పరిధిలోకి వెళ్ళాలని చూస్తున్నావు."

"నువ్వింకోసారి ఆ పరిధి అన్నమాట పలికావంటే చంపేస్తా. చిన్నప్పటి పరిధీ వైశాల్యం లెక్కలు గుర్తొస్తున్నాయి" కసురుకుంది అరుణ.

ఉమ మళ్ళీ నవ్వి అరుణ వొళ్ళో తల పెట్టుకుని పడుకుంది.

"ఊః చెప్పు" అంది అరుణ అసహనంగా.

"ఏం చెప్పను ?"

"అదే - నేను ప్రకాశం పరిధిలోకి వెళ్ళి"

"ఆ మాట వొద్దన్నావుగా."

"ఆ మాట వొద్దులే. ఇంకో మాటతో చెప్పు."

"ఏంలేదే పిచ్చిదానా. ప్రకాశం మంచివాడే. నేనేదో తమాషాకు మాట్లాడుతున్నాను. నువ్వు పెళ్ళి చేసుకుని స్వేచ్ఛగా వుండు సరేనా ?"

"ఎగతాళి చేస్తున్నావు" అలిగింది అరుణ.

"మరి నువ్వు చిన్నపిల్లలా పెళ్ళి చేసుకుని స్వేచ్ఛగా వుంటానంటే యేం చెయ్యను ? పెళ్ళి చేసుకుని ఆ సంసారంలోపడితే స్వేచ్ఛ అనే మాట గుర్తు చేసుకోటానిక్కూడా టైముండదు. ఇల్లూ, అంట్లూ, పురుళ్ళూ, పిల్లలూ."

"ఛే- ఛీ"

"అంతేమరి. మీరు ప్రేమించుకున్నారు గనకా, ప్రకాశం నాకూడా తెలుసు గనకా పూరుకుంటున్నానుగాని లేకపోతే నిన్నసలు పెళ్ళి చేసుకోనిచ్చేదాన్నేనా ? ప్రకాశంతో జీవితం బాగానే వుంటుందిలే. భయపడకు." అరుణ ముఖం చూసి అనునయంగా అంది ఉమ.

"నువ్వెప్పటికీ పెళ్ళి చేసుకోవా ?" ఆలోచిస్తూ అంది అరుణ.

"ఊఁహూఁ"

"మరేంచేస్తావ్ ?"

"పెళ్ళి చేసుకోకపోతేనే చెయ్యడానికి చాలా పనులుంటాయి. నాకు సబ్జక్ట్ అంటే ఎంత యిష్టమో నీకు తెలుసునా ? నేను రిసెర్చి చేస్తాను. నా సబ్జక్టులో నేను చేరగలిగినంత ఎత్తుకి చేరతాను. అదే నా ధ్యేయం" స్థిరంగా పలికింది ఉమ.

"పెళ్ళి చేసుకుని ఆ పని చెయ్యగూడదా ?"

"పెళ్ళి అంటూ అయితే యిక అన్నీ అందులో కొట్టుకు పోవాల్సిందే- పెళ్ళయితే స్వేచ్ఛ వుండదు. నేను రాత్రింబగళ్ళు లాబ్‌లో గడిపితే చేసుకునేవాడు పూరుకుంటాడా ? నేనొక్కదాన్నే అయితే నా యిష్టం. నా యిష్టమైతే వొండుకుంటా లేకపోతే హోటల్లో తింటా. నా యిష్టమైనంత సేపు పనిచేసుకుంటా. ఇష్టమైనపుడు రిలాక్స్ అవుతా. ఎవరికోసమో నేను ఆగాల్సిన పని వుండదు. అందుకే నాకు నవ్వొచ్చింది నేను స్వేచ్ఛ పోతుందని పెళ్ళి వొద్దనుకుంటుంటే నువ్వు స్వేచ్ఛకోసం పెళ్ళాడతానంటున్నావని."

అరుణ ఆలోచనలోపడి మౌనంగా కూర్చుంది.

"ఏమిటే-నీ మూడ్ పాడుచేశానా ? నాకంటే రిసెర్చి పిచ్చివుంది గనుక పెళ్ళి వొద్దనుకుంటున్నాను. నీకేంటి- ప్రకాశం నిన్నెంతో ప్రేమిస్తాడు. నీ జీవితం చాలా బాగుంటుంది."

"ప్రకాశం మంచివాడేనే"- సంజాయిషీ చెబుతున్నట్లు అంది అరుణ.

"అరే పిచ్చిమొహమా_ కాదని ఎవరన్నారూ ? నేను సరదాగా అన్నాను. పెళ్ళి చేసుకుని కూడా నువ్వు స్వేచ్ఛగా వుండొచ్చు" - అరుణ నెత్తిమీద కొడుతూ అంది ఉమ.

"ఐనా నేను ఉద్యోగం వచ్చే వరకూ పెళ్ళి చేసుకోనులే."

"ఔను అలా చెయ్యి. స్వేచ్ఛకు ముందు కావాల్సింది డబ్బు. లే-కాంటీన్‌కి వెళ్ళి టీ తాగుదాం పద" లేచింది ఉమ.

ఇద్దరూ కాంటీన్‌కి నడిచి అక్కడ టీ తాగి ఆర్ట్సు కాలేజీ దగ్గర నుంచున్నారు.

"రిసెర్చి యిక్కడే చెయ్యగూడదూ ?"

"ఏమో- సీటు రావాలిగా. నాకైతే ఢిల్లీ వెళ్ళాలనే వుంది"

"నాకు నాగార్జున యూనివర్సిటీ అంటే యెంత యిష్టమో నీకు సీటు యివ్వకుండా యిక్కడికు పంపాలని. ఆ ఢిల్లీవాళ్ళు కూడా నీకు సీటు యివ్వకపోతే బాగుండు."

"ఆ మాట అనకు తల్లీ. నాకూ ఉస్మానియా యూనివర్సిటీ అంటే యిష్టమే- వేరే యూనివర్సిటీల నుంచి వచ్చిన వాళ్ళ కోసం కొసిని సీట్లుంచారని."

ఇద్దరూ నవ్వుకున్నారు.

"రెండేళ్ళు ఎలా గడిచిపోయాయో గదా" అంది అరుణ.

"ఔను. నిన్ను పలకరించిన మొదటిరోజు నాకింకా నిన్న మొన్న జరిగినట్లుంది. నీచేతిలో 'కృష్ణపక్షం' చూసేసరికి నువ్వంటే యెంత ప్రేమ కలిగిందో ! వెంటనే పలకరించేశాను. నేనడిగిన మొదటి ప్రశ్న గుర్తుందా ?"

"ఈ పుస్తకంలో మీకిష్టమైన కవితలు రెండు చెప్పండి అనేగా."

"నువ్వు "స్వేచ్ఛాగానము", "అబ్బ!" అనే పేర్లు చెప్పగానే నేనేం చేశాను?"

"నన్ను కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నావు. సరేగాని నన్ను ప్రకాశం పలకరించింది కూడా ఆ రోజే. అంతకుముందు పొట్టి చూపులే తప్ప మాటలులేవు. మీరిద్దరూ నా జీవితంలోకి ఒక్కరోజే ఎలా వచ్చేశారోగదా".

కాసేపు యిద్దరూ ఆనందంలో మునిగి మౌనందాల్చారు.

"ఇక వెళ్దామా" ఉమ అడిగితే నీరసంగా "ఊఁ" అంది అరుణ. బస్‌దిగి యింటికి నడుస్తుంటే అరుణ మామూలుగా లేదని గ్రహించింది ఉమ.

"అరుణా- ఏం జరగదులే, నేనున్నానుగా. ఊరికే వర్రీ అవకు."

"ఎందుకో నాకే తెలియకుండా నేను గిల్టీ అయిపోతాను ఉమా ! వాళ్ళేం అనక్కరలేదు. వాళ్ళ చూపులు చాలు. నేనేదో మహాపాపంచేసిన ఫీలింగు కలుగుతుంది. నేనేదో పంజాయిషీ యిచ్చుకోవటం. వాళ్ళు వెటకారాలూ, అక్షింతా. మా

అమ్మ ఏడుపులూ యివన్నీ యెంత చెత్తగా వుంటాయో వాటన్నిటినీ భరించటంకంటే నోరు మూసుకుని యింట్లో కూచోటం వుత్తమం అనిపిస్తుంది."

ఇద్దరూ మౌనంగా యింట్లోకి నడిచేసరికి వాతావరణం యేపోగానే వుంది. వీళ్ళనెవరూ గుర్తించినట్టు కనపడలా. ముఖాలు మాడ్చుకుని యెవరి పనుల్లో వాళ్ళున్నారు. జానకీరామయ్య పడక్కుర్చీలో కళ్ళు మూసుకుని పడుకున్నాడు. గోపాల్రావు పేపరు చదువుకుంటూ మధ్యగదిలోనే వున్నాడు.

అరుణ కాసేపటూ యిటూ తిరిగి ఉమను "స్నానం చేస్తావా ?" అనడిగింది.

ఉమ తలూపి బట్టలు తీసుకుంది. అరుణ బకెట్‌తో నీళ్ళు బాత్‌రూంలో పెట్టివచ్చింది.

"అరుణా" జానకీరామయ్య పిల్చాడు.

అరుణ నెమ్మదిగా తండ్రి దగ్గరకు వెళ్ళింది.

"ఎక్కడికి వెళ్ళావు ?" పంచాయతీ ప్రారంభమయింది.

"యూనివర్సిటీకి"

"సినిమాకన్నావుగా" మేనత్త కనకమ్మ రాగం పచ్చింది.

"సినిమాకనే బయల్దేరాంగానీ మళ్ళీవొద్దని యూనివర్సిటీకి వెళ్ళాం" సినిమాకేనని యెందుకు చెప్పలేదా అనుకుంటూ చెప్పింది అరుణ.

"యూనివర్సిటీ కెందుకు ? సెలవలేగా" సీతమ్మ అడిగింది.

"యూనివర్సిటీకో మరెక్కడికో మనకు అసలు సంగతి చెబుతారా వీళ్ళు. వాళ్ళేం చెబితే అది నమ్మాల్సిందే" కనకమ్మ అరుణమీద కసి తీర్చుకుంది.

"అంటే నేనెక్కడకు వెళ్ళానని నీ వుద్దేశం?" కోపంగా అడిగింది అరుణ.

"నువ్వెక్కడికి వెళితే నాకెందుకు తల్లీ. నామీద నీకు కోపం రావటం-నేను మాటలు పడటం. మీ అమ్మా నాన్నా వున్నారు. మధ్యలో నేనెవర్ని" ఆవిడ నాలు గడుగులు వెనక్కువేసి నుంచుంది.

"ఊరికే యే పనీ లేకుండా తిరగటం యెందుకంటా. రోజులసలే బాగాలేవు. నువ్వొచ్చేదాకా అందరం గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకు యెదురుచూడాలి" జానకీ రామయ్య విసుక్కున్నాడు.

"మన భయం సంగతి దానికెందుకు నాన్నా దాని సరదాలు దానికి కావాలి.

మనం భయపడ్తా, వీధిలో తలొంచుకోవాల్సి వచ్చినా దానికేం లెక్కలేదు." గోపాల్రావు పేపరు అవతలపడేసి నుంచున్నాడు.

"మీకెందుకండీ- పెద్దాయన అయనన్నారు. ఆయన కూతురి విషయం ఆయన చూసుకుంటారు. మీరేమన్నా పెద్దరికం వహించబోతే నీ అంత నేనూ చదివాను నీ లెక్కేమిటి అంటుంది. మీకెందుకంటా" సుశీల అందుకుంది.

ఉమ బాత్‌రూంలోంచి రావటంతో అందరూ ఎటువాళ్ళటు వెళ్ళారు. అరుణ బాత్‌రూంలో దూరి కాసేపు యేడ్చి ముఖం కడుక్కొని వచ్చింది.

ఉమ యెక్కడా కనపడలేదు.

"ఉమేది?" అని అడిగింది సుశీలని.

"ఏమో- యెవరికి తెలుసూ" విసురుగా అంది సుశీల.

"డాబామీదికి వెళ్ళినట్టుంది" సీతమ్మ చెప్పింది.

అరుణ డాబా ఎక్కింది.

"ఏంటి - సీరియస్‌గా వున్నారందరూ - సిక్ క్లాసు తీసుకున్నారా ?"

"ఆఁ - అయిపోయిందిలే ఆ గోల, పోనీ - ఇంకాసేపట్లో వెళ్ళిపోతావు. కబుర్లుచెప్పు."

"కబుర్లకేం కావాల్సినన్ని - సరేగాని మర్చిపోయాను. ప్రకాశంరాసిన ఉత్తరాలన్నీ నావగ్గరే వున్నాయి. తెచ్చాను. తీసుకొని దాచుకో" అంది ఉమ.

"వద్దు ఉమా - నాకు దాచుకోటానికి ఈ యింట్లో కాస్త జాగాకూడా లేదు. అన్ని వుత్తరాలు ఎక్కడపెట్టను ? నాకంటూ ప్రత్యేకంగా చిన్న అట్టపెట్టెకూడా లేదు. ఒకవేళవున్నా అందరూ చూస్తారు. చూసేదాకా ఎవరికీ నిద్రపట్టదు. నీదగ్గరే వుంచు."

ఉమ మాట్లాడలేదు.

"మా పెళ్ళయ్యాక మేమిద్దరం కలిసి నీ దగ్గరకువచ్చి ఆ ఉత్తరాలు తీసుకుంటాం లే-"

"పెళ్ళి పెళ్ళి అంటున్నావు యేమన్నా ఆలోచిస్తున్నావా ? మీవాళ్ళెలాగూ వొప్పుకోరు. యెలా జరుగుతుంది ? బాగా గొడవచెయ్యరూ ?"

"అసలు వాళ్ళకి చెప్పను. వాళ్ళను వొప్పించుదామనుకోవటం వ్యర్థం. రిజిష్ట్రేషన్ చేయించుకొని ఒకరోజు ఇక్కడినుంచి ప్రకాశం దగ్గరకు వెళ్ళిపోవ

టమే. తర్వాత వుత్తరం రాస్తాను. వస్తే వస్తాడు. లేకపోతే లేదు. ముందు వాళ్ళకు తెలిసిందో నన్ను చంపైనా చంపుతారుగాని పెళ్ళి జరగనివ్వరు. ఆ రహస్యం బైటపడకుండా చూడటమే నా పని....ప్రస్తుతం."

"పెళ్ళి విషయంలో నీకేసాయం కావాలన్నా గుంటూరు వచ్చెయ్ అరుణా. మా వాళ్ళు గొప్పవాళ్ళుకాదుగానీ కొంతవరకూ విషయాల్ని అర్థం చేసుకుంటారు. నువ్వేమీ సందేహించకు నా దగ్గరకు వచ్చెయ్-"

ఉమ చేతిని ప్రేమగా నొక్కింది అరుణ.

ఎనిమిదింటిదాకా కబుర్లు చెప్పుకుని కిందికి దిగివచ్చారు. అరుణ యిద్దరికీ అన్నంపెట్టింది. భోజనాలుచేశాక యిద్దరూ వాకిట్లో ఎందుకో భారంగా పోతున్న ఆటోని ఆపారు.

"ఉమా - సారీ - నిన్ను ఐస్కెక్కించటానికి రాలేను."

"పిడికావులే - ఇంత రాత్రి మళ్ళీ వొక్కదానివే రావొద్దూ. నీకెంత స్వేచ్ఛగా తిరగాలనివున్నా పరిస్థితుల్ని కూడా గమనించుకోవాలమ్మాయ్-"

పెట్టె ఆటోలో పెట్టించి యెక్కి కూచుంది ఉమ.

"ఉత్తరాలు రాస్తావుగా" బెంగగా అడిగింది అరుణ.

"ఊఁ- మరి కలవట్లో యింకేం పనుంది ?"

"జాగ్రత్తగా రాయి. సెన్సారవుతాయి"-

"అబ్బా - బోర్ - సరేలే"-

ఆటో కదిలిపోయింది. అరుణ గేటువేసి లోపలికి వెళ్ళి యెవరితోనూ మాట్లాడకుండా దుప్పటిముసుగు పెట్టుకుని పడుకుంది.

ఇంట్లో వాతావరణం గురించి ఆలోచించాలనిపించలేదు. ఉమ ఎంత మంచిది. పెళ్ళి గురించి ఎంత బాగా ఆలోచించింది. నిజంగానే పెళ్ళయితే యిల్లూ పిల్లలూ వీటిల్లో చిక్కుకుపోతే యింక స్వేచ్ఛేమిటి ? కానీ పెళ్ళి లేకుండా యీ యింట్లో యింక తనుండలేదు. అందులో ప్రకాశాన్ని వొదిలి.

ప్రకాశానికి తనంటే యెంతో ప్రేమ.

మా ప్రేమతో స్నేహంతో యెంతో హాయిగా వుంటాం.

కలిసి పనిచేసుకుంటాం.

ప్రతి విషయం కలిసి ఆనందిస్తాం.

ఒకరి కోరికలు వొకళ్లం అర్థంచేసుకుంటాం.

ఐదేళ్ళ తర్వాత పిల్లల్ని కనొచ్చు పిల్లల్ని స్వేచ్ఛగా పెంచుతాం.

నా యిల్లంటూ నాకుంటే నాచుట్టూ ఆరాతీసి నన్నదుపులో పెట్టేవాళ్ళు లేకుండావుంటే చాలు. ప్రకాశంతో అలాగే వుంటాను.

ఈసారి ప్రకాశంతో యీ విషయం మాట్లాడాలి. "పెళ్ళయ్యాక కూడా స్నేహంగా వుండాల ప్రకాశం" అని చెప్పాలి.

అమ్మా నాన్నల్లా పెళ్లి సంకెళ్లా వుండకూడదు.

ప్రకాశంతో మాట్లాడాలి....!

* * *

అరుణ పార్కులోకి వస్తూనే ప్రకాశంకోసం వెతికింది.

సికింద్రాబాదు కంటోన్మెంటు ప్రాంతంలో వున్న ఆ పార్కు చాలా చిన్నది. పార్కులో కూచుని ఆనందించటానికి అక్కడికెవరూ రారు. నిద్రపోయే కూలీలతో, ఆడుకునే పిల్లలతో నిండివుంటుంది.

ఆ ప్రాంతంలో అయితే తెలిసిన వాళ్ళెవరూ కనపడరని ఆ పార్కు యెంచుకున్నారు అరుణ, ప్రకాశం. క్రమంగా ఆ పార్కుతో అనుబంధం పెరిగిఅదే యిష్టమైపోయింది.

ప్రకాశం ఎర్రపూల చెట్టుకింద కూచుని యేదో చూస్తున్నాడు. అరుణ వెళ్ళి పక్కన కూచున్నాకగాని అతను అరుణను గమనించలేదు.

"నాకోసం యెదురుచూస్తుంటావని హడావుడిగా వచ్చాను. తీరా చూస్తే నువ్వేదో ఆలోచనల్లో వున్నట్టున్నావు నా హడావుడి అంతా అనవసరమేనా ?" నవ్వింది అరుణ.

"నీ గురించిన ఆలోచనలు నీకంటే బాగున్నాయి. నాకు నువ్వు తప్ప యింకో లోకం లేకుండా పోయింది. ప్లీజ్-నాచెయ్యి పట్టుకుని నన్ని లోకంలోకి తీసుకురావూ ?" దీనంగా ముఖం పెట్టాడు ప్రకాశం.

ఫక్కున నవ్వింది అరుణ.

"నన్నేం చెయ్యమంటావ్ ?"

"నన్ను వెంటనే పెళ్ళిచేసుకో"

"పెళ్ళంటే భయంగావుంది"

"అర్థంలేదు, అరుణా- ఈ విషయం యింత సస్పెన్సు నాకేం బాగోలేదు. సీరియస్‌గా మాట్లాడు. ఎప్పుడు మన పెళ్ళి ?"

అరుణ ప్రకాశం ముఖంలోకి చూసింది. ప్రకాశంమీద ప్రేమ హృదయమంతా నిండిపోయింది.

అదే క్షణంలో ఉమ మాటలు కూడా గుర్తొచ్చాయి. పెళ్ళంటే గానుగెద్దు జీవితం. ఇల్లూ పిల్లలు తప్ప మరో లోకం లేకుండా బతుకంతా గడపటం అంటే భయంగానే వుంది. కాని ప్రకాశం లేకుండా తను బ్రతకాలి. ఆ యింట్లో, ఆ నరకంలో వుండగలదా ? అసలు వాళ్ళు వదిలేస్తారా ? ప్రకాశమంటే తనకెంతో ప్రేమున్నదీ ఈ భయం దేనికి ? ప్రకాశం ప్రేమగా మాట్లాడుతుంటే ఇష్టంగా నవ్వుతుంటే ముద్దు పెట్టుకోవాలనిపిస్తుంది. అతన్ని గుండెలకు హత్తుకోవాలనిపిస్తుంది. పెళ్ళి కాకుండా యెలా ?

"ఎన్నాళ్ళు ఆలోచిస్తావు అరుణా"

అరుణ ఈ లోకంలోకి వచ్చింది.

"మనసు విప్పి మాట్లాడు. ఎందుకింకా ఆలస్యం ?"

"ఏం లేదు ప్రకాశం - పెళ్ళంటే యే ఆడపిల్లకయినా భయంగానే వుంటుంది నాకూ భయంగానే వుంది. నిన్న మా ఉమ మాటలు విన్నాక యింకాస్త భయం పెరిగింది."

భయమేమిటి ? ఎందుకు ? నాకులేని భయం నీకొక్కదానికే యెందుకు ? ఏమంటుంది మీ ఉమ." కాస్త చిరాగ్గా అన్నాడు.

"ఎందుకంటే - పెళ్ళయిన తర్వాత నీ జీవితం యేమి మారదు. మారినా అంతా నీకనుకూలంగా నీకు సుఖంగా వుండేలా మారుతుంది. నాజీవితం అట్లా కాదు"

"అదేంటి ? నేను సుఖంగావుండి నిన్ను కష్టపెడతానా ? నిన్ను - నా ప్రాణాన్ని-" విస్తుపోయినట్లు చూశాడు ప్రకాశం.

"నేచెప్పేది విను. నువ్వు నన్ను తిట్టవు. కొట్టవు. ప్రేమగానే చూస్తావు. మరి ఆ ప్రేమకు ప్రతిఫలంగా - నేనేం చెయ్యాలి ?"

"నన్ను ప్రేమించాలి !"

"ప్రేమించటం అంటే ఏమిటి ? ఒకరి కళ్ళల్లోకి వొకరు చూసుకోవటమేనా ? అది పెళ్ళికాక ముందు. పెళ్ళయ్యాక ఆడదాని ప్రేమ ఆవిడ చేసే సేవల్లో కనపడుతుంది మగవాళ్ళకి. మనిద్దరం పెళ్ళిచేసుకుంటాం కలిసి వుంటాం. పొద్దున్నే నేను కాఫీచేసి నీకిస్తే ఆ కప్పులో నా ప్రేమ కనపడుతుంది నీకు. అలాగే నేను వొండిపెట్టే తిండిలో, నేను వుతికే బట్టల్లో, నేను చేసే పరిచర్యల్లో వీటిల్లో ప్రేమ కనిపిస్తుంది. క్రమంగా నేనో వ్యక్తిగా కనపడటం మానేసి బాగా మన్నుతున్న వస్తువులా కనపడి-"

"అరుణా - అర్థం లేకుండా మాట్లాడకు. నువ్వు తిండి వొండి పెడతావని నిన్ను ప్రేమిస్తున్నాను. తిండి వొండకపోతే ప్రేమించనా ? నీ అందం, తెలివి, ప్రతి విషయాన్ని సున్నితంగా ఆలోచించే నీ మనసూ వీటిని ప్రేమిస్తున్నాను గాని - నువ్వు కాఫీచేసి యిస్తావనీ, వంటచేసి పెడతావని ప్రేమిస్తున్నానా ? పోనీ అవన్నీ నేనేచేసి పెడతాలే-పెళ్ళికి వొప్పుకో".

నవ్వింది అరుణ

"పెళ్ళయ్యాక ఆడవాళ్ళకు స్వేచ్ఛపోతుందంటుంది ఉమ. నాకిప్పుడు స్వేచ్ఛ లేనేలేదు గనక పోయే సమస్యే లేదు. నా సమస్యంతా పెళ్ళితో స్వేచ్ఛ పొందగలనా అని - ఇవాళ నేను నాలుగు గంటలకు యింటి నుంచి బయలుదేరాను. ఆరింటికల్లా మళ్ళాయింట్లో వుండాలి. అబద్ధం చెప్పి యిక్కడికి వచ్చాను. రాత్రి పడుకోబోయేంతవరకూ ఈ అబద్ధం యెవరికన్నా తెలిసిందేమో, అదెప్పుడు యెలా బద్దలవుతుందో, యెంత అవమానం భరించాలో అనే చిత్రహింస పడుతూనే వుండాలి. అదో కథ కానీ పెళ్ళయ్యాక - పెళ్ళయ్యాకయినా, నేనొక్కదాన్నీ యిలా పార్కుల్లో, యింకో ఫ్రెండుతో మాట్లాడుతూ కూచోగలనా ? నువ్వొక్కడివే వుంటావనీ, నువ్వే మనసుపడతావోననీ, నీకు భోజనానికి ఆలస్యం అవుతుందేమోననీ లక్ష అనుమానాలతో భయాలతో సందేహాలతో మనసు పాడయిపోదూ ? నాకు భవిష్యత్తులోనన్నా స్వేచ్ఛగా వుండాలని వుంది నా టైము నా యిష్టం వచ్చినట్లు గడపాలి. ఆరుకాదు పన్నెండు గంటలకు ఇల్లు చేరినా యెవరికీ సంజాయిషీ యిచ్చుకోనవసరం లేకుండా గడపాలని -" ఆగింది అరుణ.

"నువ్వెంత అర్థంలేకుండా మాట్లాడుతున్నావో, నన్నెంత అపార్థం చేసుకుంటున్నావో ఆలోచిస్తే నీకే తెలుస్తుంది. నేను నిన్ను హింసించి కాల్చుకు తింటానన్నట్టు నువ్వెందుకు ఆలోచిస్తున్నావో నాకు తెలియటంలేదు."

కోపంతో ప్రకాశం ముఖం ఎర్రగా కందింది. మాట్లాడకుండా కూచున్నాడు.

అరుణకు దిగులనిపించింది.

పాపం ప్రకాశం మంచివాడే. తననింత ప్రేమించే ప్రాణాన్ని వొదులుకో గలదా ? ఆ యింట్లో యింకా యెక్కువ రోజులుంటే తనకు పిచ్చెక్కిపోతుంది.

'నాకు ఉద్యోగంరానీ ప్రకాశం' అనునయంగా అంటి.

"అప్పుడు ఆలోచిస్తావా ?" ప్రకాశం గొంతులో స్త కఠినంగా వుంది.

"కాదు-వుద్యోగం రాగానే పెళ్ళిచేసుకుందాం."

"అరుణా - నిజంగానా ?" ప్రకాశం అరుణచేతిని తన చేతిలోకి తీసుకొని ముద్దాడాడు.

"అరుణా - నువ్వు వుద్యోగం చేద్దువుగాని. నాక్కూడా అదే యిష్టం. కానీ వుద్యోగం దొరికే వరకూ పెళ్ళి వాయిదా యెందుకు ? నాది మంచి వుద్యోగమే. మనకేం యిబ్బంది వుండదు. నీ వుద్యోగం నెమ్మదిగా చూసుకోవచ్చు."

"కాదులే ప్రకాశం. వుద్యోగం దొరికాకే పెళ్ళి" ఖచ్చితంగా అంది అరుణ.

'సరే నీయిష్టం' ప్రకాశం అరుణ భుజం మీద చేయివేశాడు.

"ఇక వెళదాం" అంది అరుణ చుట్టూచూస్తూ.

"అప్పుడే - ఐదుంపావే అయింది".

"ఇల్లు చేరేసరికి ఆరవనే అవుతుంది. టైముకి వెళితే వాళ్ళకీ నాకూ కూడా శాంతి" లేచింది.

* * *

ఇంట్లో అందరూ తనగురించి అంతా హడావుడి పడటం అరుణకు కొత్త కొత్తగా అనిపించినా సంతోషంగా కూడా వుంది. ప్రైవేటు జూనియర్ కాలేజీ వాళ్ళు లెక్చరర్లు కావాలని పేపర్లో వేస్తే అప్లికేషను పెట్టింది అరుణ.

వాళ్ళు ఇంటర్వ్యూకు పిలిచారిప్పుడు.

ఇంట్లో కనకమ్మ తప్ప మిగిలిన అందరూ సంతోషంగానే వున్నారు.

కనకమ్మ మాత్రం "అవతల మనవరాలు పుట్టింది-ఇదేమో పెళ్ళి పెటాకులు లేకుండా వూళ్ళమీదికి బయల్దేరుతుందా. ఆ పెద్దపిల్ల తలవంచమంటే వంచింది.

ఎత్తమంటే ఎత్తింది. ఇది ఎద్దేమంటే తెద్దేమంటుంది. ఇక వుద్యోగం కూడావస్తే మన్ని లెక్కచేస్తుందా" అంటూ దీర్ఘాలు తీసింది.

గోపాల్రావు అరుణను స్కూటర్ మీద తీసుకెళ్ళి దింపుతానన్నాడు.

అరుణ ఆశ్చర్యపోయింది.

మామూలుగా అరుణను స్కూటరెక్కించుకోవటం నామోషీపని గోపాల్రావు దృష్టిలో. వీళ్ళందరి ప్రవర్తనకూ ఆశ్చర్యపోతూ, యింటర్వ్యూ యెలా చేస్తానోనని కంగారుపడుతూ, ఆనందం ఆందోళనా మనసుని కమ్మేసి నీరసపడిపోయింది అరుణ.

కాలేజీ దగ్గర గుంపును చూసేసరికి ఆ నీరసం మరింత ఎక్కువైంది.

ఇంతమందిలో తనకు వుద్యోగం వస్తుందా ?

తన క్లాస్‌మేట్స్ యిద్దరు కనిపిస్తే వాళ్ళదగ్గరికే వెళ్ళికూచుంది.

"నువ్వొచ్చావు. ఇక మేం వెళ్ళిపోవచ్చు" అంది వాళ్ళలో ఓ అమ్మాయి.

"అదేం" ఆశ్చర్యంగా అడిగింది అరుణ.

"మీవాళ్ళదే యీ కాలేజీ. మాకెందుకు యిస్తారూ ?"

అరుణకు చిరాకేసి యేమీ మాట్లాడకుండా కూచుంది.

కులాన్ని బట్టి వుద్యోగాలు దొరికేమాట నిజమేగాని, తనకసలు ఈ కాలేజీ వాళ్ళది యేకులమో తెలియదు. తనది తప్పున్నట్లు మాట్లాడుతుందేం - పైగా తన కులం నుంచి తనొక్కతే వచ్చిందా-చాలామంది వచ్చే వుంటారు. ఐనా కులాన్ని బట్టి వుద్యోగాలిచ్చేవాళ్ళు ముందే ఎవరోవొకర్ని ఆలోచించుకునే వుంటారు. ఇవన్నీ ఆలోచించకుండా తననంటే తనేంచేస్తుంది ?

అరుణ ఆలోచనల్లో వుండగానే ఆ యిద్దరు లోపలికి వెళ్ళటం రావటం కూడా అయిపోయింది.

"మేం వెళ్తున్నాం" అన్నారు వాళ్ళు.

"ఇంత తొందరగా అయిపోయిందేం ? ఏమడిగారు వాళ్ళు ?"

"ఏమీ అడగలా. ఊరికే మొఖంచూసి పంపించేశారు. ఉద్యోగం యిచ్చేబాపతు కాదులే"

వాళ్ళు వెళ్ళిపోయారు.

ఇంకో నలుగురైదుగురి తర్వాత అరుణని పిల్చారు.

